ప్రథమ ముద్రణ – జూన్, 2000


వెల : రూ. 50/-

డా. అంతటి నరసింహం
4, సంతోష్ డీలక్స్ అపార్టమెంట్స్,
మెహిదీ పట్నం,
హైదరాబాదు – 500 028
ఫోన్ : 3513564

ముద్రణ :
వర్మ గ్రాఫిక్స్
హైదరాబాద్
ఫోన్ : 6575841

దొరకు చోటు :
విశాలాంధ్ర బుక్ పబ్లిషింగ్,
బాంక్ స్ట్రీట్, హైదరాబాదు.

లేజర్ టైప్ సెట్టింగ్ :
వియాన్స్ గ్రాఫిక్స్,
గాంధినగర్,
హైదరాబాద్ – 500 080
ఫోన్ : 7675197

## కృతి స్వీకర్తలు

# శ్రీమతి కాండ్రేగుల రాధిక

# శ్రీ కాండ్రేగుల నాగేశ్వరరావు



కాండ్రేగుల నాగేశ్వరరావుగారు నిత్య పఠనాశీలి. అనేక గ్రంథాలను ఆంగ్లంలోనూ, తెలుగులోనూ చదివారు. చదువుతున్నారు. గొప్ప విమర్శకులు. వక్త. కమ్మర్షియల్ టాక్స్ డిపార్ట్‌మెంటులో చాలా ఉన్నతోద్యోగి. శ్రీమతి రాధిక ఆయనకు తగిన సతీమణి. నిత్య ప్రోత్సాహి. వారిద్దరికీ నా యీ గ్రంథాన్ని అంకితం ఇస్తున్నాను.

# రామాయణంలో స్త్రీలకు దగా

ఇందులో సీత, కైక, తాటక, శూర్పణఖ, అయోముఖిల గూర్చి గేయంలో రాయడం జరిగింది. ''రామాయణంలో దగాబడ్డ స్త్రీమూర్తులు అన్న విమర్శ గ్రంధంలో సీత, కైక, తాటక, శూర్పణఖ, అయోముఖిలతో పాటు తారను గూర్చిగూడా వ్రాయడం జరిగింది. ఈ స్త్రీలకు ఎనలేని అన్యాయం జరిగింది. శ్రీరాముని సాక్షిగా అతని ద్వారానే జరిగింది. ఆ స్త్రీల -- ఆస్త్రీలను గూర్చి గేయాలు రాయడమే ఈ ప్రయత్నం.

రాముణ్ణి దేవుడుగా కొలుస్తూన్నారు అదే విచిత్రం. నేను దేవుణ్ణిగాదు - మనుషుడినే అని రాముడే రామాయణంలో చాలా చోట్ల చెప్పాడు. రామాయణ రచన తర్వాత చాలాకాలం వరకూ రామ భజనలు లేవు. ముఖ్యంగా పదిహేనవ శతాబ్దం తర్వాత వచ్చింది యీ స్థితి. ముస్లిములు మనదేశం వచ్చి స్థిర పడ్డాకనే ఈ స్థి వచ్చింది. ముస్లిం మత వ్యాప్తిని నిలవరించడానికే ఈ స్థితి నెలకొన్నది. ''జనమంతా రాముడి వెనక వచ్చారు'' అని తులసీ రామాయణం తర్వాత వ్రాశారు. **(सभी लोग राम के पीछे पडे).**

రామాయణానికి ఆంధ్ర ప్రాంతంలోనే ఎక్కువ ప్రశస్తి. ప్రతి గ్రామములోనూ రామాలయం వుంది. అతంతా భద్రాద్రి రామాలయ ప్రభావమేమో అనిపిస్తుంది. తమిళ ప్రాంతంలోనూ కన్నడ ప్రాంతంలోనూ, మలయాళ ప్రాంతంలోనూ గూడా ఆ ప్రశస్తి వుందిగాని ఆంధ్ర ప్రాంతంలో వున్నంత గాదు.

ఉత్తర హిందూస్థానంలో అధిక ప్రశస్తివుంది. రామాయణానికి ఉత్తర ప్రదేశ్‌లో ఇంకా యెక్కువ. ఉత్తర ప్రదేశ్ బీహార్లలో బ్రాహ్మణుల ప్రాబల్యం ఎక్కువ. పైగా రామాయణం బ్రాహ్మణుల ప్రధాన కావ్యం. రామాయణంలో ఎక్కడ చూచినా బ్రాహ్మణులకు గాను దానాలూ హిరణ్యదానాలు అధికం. కౌసల్య లక్షగోవులను బ్రాహ్మణులను దానం చేసిందనీ సుమిత్ర లక్షగోవులన్ను దానం చేసిందనీ కైక గూడా చేసిందనీ రామాయణంలో చెప్పబడివుంది. గొప్పఅతిశయోక్తి అయినప్పటికీ ఆరోజుల్లో గోదానాలు అధికంగా వున్నాయన్నమాట. బ్రాహ్మణ రుషుల ప్రాబల్యం హెచ్చు రామాయణంలో.

రుషులా రాముడి చేత రాక్షసుల చంపిస్తూ వుంటారు. అందుకు బాణాలు అధికంగా రాముడికిస్తూ వుంటారు.

తాటక వధా ఘట్టంలోనూ, శూర్పణఖ ముక్కు చెవులూ కోసేఘట్టంలోనూ ''గోబ్రాహ్మణ హితం కోసమూ, చాతుర్వర్ణ్య రక్షణార్థమూ మేము రాక్షస వధ చేస్తున్నాం అని రాముడంటారు రాక్షసులు రామాదులకు ఏమీ హాని చేయక పోయినప్పటికీ, రాక్షస వధార్థం రాముడు బయలుదేర్తాడు. ''మన కేమీ హాని చేయని రాక్షసుల చంపడ మెందుకు'' అని సీత రాముణ్ణి అడుగుతుంది గూడాను.

కాని వారిని కర్కశంగా వధించే క్రూరమనస్తత్వం రాముడిది. బ్రాహ్మణ హితార్థం ఏమయినా చేస్తాడు. కులవ్యవస్థ కొనసాగడానికి ఏమయినా చేస్తాడు. ఇలాంటి రాముణ్ణి బ్రాహ్మణులు పూజించారంటే అర్థంవుంది. నూటికి తొంబై ఆరు మందిగల బ్రాహ్మణేతరులు గూడా రామ పూజలూ రామభజనలూ చేస్తున్నారంటే అదే విచిత్రం.

# విషయ సూచిక

# సీతాదేవి ప్రాణత్యాగం

అది అయోధ్యానగరి కనతి దూరమునున్న
దది యొక్క ఆశ్రమము వాల్మీకి ఆశ్రమము
ఆ ఆశ్రమము చెంతనే సీత దిగ విడిచి
అసలు విషయము చెప్పి లక్ష్మణుడు వెళ్లాడు

పాపమా సీత అప్పుడు నిండు చూలాలు
ఏ పాపమెరుగనిది ఆరాముని ఇల్లాలు
మాయ మోసపువలలో చిక్కుకున్నాను అని
విలవిలా తన్నుకొని కుమిలి కుమిలేడ్చినది

పురుష ఆధిక్యభావన కాలమయ్యది
పాలకక్షత్రియ నిరంకుశపు కాలమది
బ్రాహ్మణపురోహిత నిరంకుశపు కాలమది
ఋషిపుంగవులు రాజులను గూడ భయపెట్టి
తమ ఆటలను సాగ జేయు కాలమ్ము అది
శూద్రుణ్ణి హీనముగ చూచేటి కాలమది
అస్పృశ్యునొక పశువు కన్న హీనమ్ముగా
చూచేటి కాలమది దుర్మార్గ కాలమది

ఆ అయోధ్యా నగరి రాణి వాసపు రాణి
నిర్దయుడు భర్త నిర్దాక్షిణ్యమున బడి
రోదించి రోదించి నలుదెసలు పరికించి
నీరసమ్ముగ నేలపైన చదికిల బడెను

ఇంతలో వాల్మీకి శిష్యగణమును గూడి
సీత చెంతకు వచ్చి అసలు విషయము తెలిసి
ఓదార్చి తన ఆశ్రమము చేర్చి ఆహార
వసతులను కల్పించి ఆదరమ్ముగ జూచె

అంతటి మహారాణి ఆ అయోధ్యారాణి
అడుగులకు మడుగు లొత్తెడి సఖీజనములును
వింజామరలు విసరు దాసీలు లేనిదై
తాపస స్త్రీవలెను పర్ణశాలను నుండె

ముగ్గురత్తలు గలుగు నిల్లాలు సీతమ్మ
ఒక్క అత్తయు పాపమిది యేమిటనలేదు
జనకుడామెను జనకు డతని సతి తన తల్లి
వారెవ్వరును పాపమిది యేమిటన లేదు

ఇదియేమి క్షత్రియుల మర్యాదలో గాని
పెళ్ళి జరిగిన వెనుక పుట్టినల్లే లేదు
పెళ్ళిజరిగిన వెనుక పురుషునాస్తియె నారి
అస్వతంత్రే సీత రాణి అయితే నేమి?

నవమాసములు నిండి సీత నొప్పులు పడెను
అత్త తరపున గాని తల్లి తరపున గాని
పురుడు పోయగనెవరు లేరు సీతకు దిక్కు
పురుడు పోసిరి పాప మాతాపస స్త్రీలె

# సీతాదేవి ప్రాణత్యాగం

వాల్మీకి పంచాంగమును విప్పి చూశాడు
జన్మ నక్షత్రము చూచి నామ నక్షత్రము వెదికి
తల్లిదండ్రుల నామములు పైకి చదువుచును
కుశలవులు అని వారి నామ కరణము చేసె

లవణారుని పైకి శత్రుఘ్నుడేగుచును
సరిగ సమయాన ఆ ఆశ్రమమ్మున విడిసె
ఈ తతంగము చూచి సీతున్నదని తలచి
వచ్చి సీతను చూచి బాగుంటివా అనెను

అంతకంటెను అతడు ఇంకేమి చేయును
రామశాసనమన్న రాముడన్నను భయము
కానివారిని క్రూరముగ వధించెడి రాము
డన్నచో నెల్లరకు భయము గొలిపే భయము

పదునాలుగేళ్లువన వాసాన సీతమ్మ
పతిభక్తి నర్థమ్ము చేసికొన్నట్టి ఆ
లక్ష్మణుడు గూడ ఆ రాముని క్రూరమగు
శాసనము పాటించి యేడ్చుకొని పోయాడు

వారసత్వ ఫలమ్ము హక్కున్న రాజ్యమును
తల్లి వరమును గూడ కలిసిపొందిన హక్కు
భయపడుచునేలి రాముని వశమ్మును చేసి
నట్టి భరతుడును గూడ రామునికి భయపడును

ప్రాణాధికముగ తలచి నట్టి రాముడు వదలె
భక్తితోడుత మెలగు లక్ష్మణుడునూ వదలె
సరిగ పలకరింపకనె శత్రుఘ్నుడునూ వదలె
భరతుడిప్పటి వరకు తిరిగి చూడక యుండె

సర్వులును వదిలేసిరని సీత బాధపడె
ఎడదలో ఉబికుబికి దుఃఖమ్ము బయట పడె
వాల్మీకి అది చూచి తలనిమిరి వెనుదట్టి
కొంతకాలము ఓర్చుకొనుమంచు ఓదార్చె

కుశలవులు ఇద్దరు కుశాగ్రబుద్ధులు, వారు
వాల్మీకి చెప్పగా వేదత్రయము నేర్చి
ఘనజటాది క్రమము నిర్దుష్టముగ నేర్చి
వాల్మీకి రచియించు రామాయణము నేర్చి

వీణపై రామాయణము పాడగానేర్చి
తాళలయజ్ఞానమును తప్పకనుపాటించి
నిర్దుష్టముగ శ్రుతిని మేళవించుట నేర్చి
రామాయణ ప్రచారమును సాగించారు.

వారిర్వురిపుడు పదునాలుగేడులవారు
యౌవన ప్రారంభ దశనడుగు ఇడినారు
అవయవములిపుడిపుడె బిగుసుకుంటున్నదశ
పొడవు పెరుగుటకు ప్రారంభమైనట్టి దశ

## సీతాదేవి ప్రాణత్యాగం

పద్మపత్రము బోలు నేత్రద్వయమ్ముతో
అర్ధచంద్రుని బోలు ఫాలద్వయమ్ముతో
కోదండమును బోలి భ్రమరవర్ణముతోడ
కుటిలమ్ములగు భ్రూలతాద్వయమ్ములతో

శ్రీకారములబోలు కర్ణద్వయమ్ముతో
శంఖముల బిగియంచి నట్లున్న కంఠముల
పై గుండ్రమై కొద్దికోల శీర్షములతో
కారు నలుపున వంకరల్ తిరిగి మెడలపై
జీరాడు చున్నట్టి గిరజాల జుట్టుతో

తల్లి సీతా మహాదేవి దేహపు ఛాయ
గలిగి స్వర్ణచ్ఛాయనైగనిగ్యమ్ముతో
అచ్చు శ్రీరాముడే రెండురూపాలతో
వెలసినాడన్నట్లు నున్న దేహాలతో
శ్రీరాముడపుడు చేస్తున్నట్టి ఆ అశ్వ
మేధయాగపు యజ్ఞశాలలో అడుగిడిరి
అచట జరిగెడి తంతు చూచుచును నిలబడిరి

ఆకస్మికముగ ఆకసమునుండి భూలోక
మవతరించిన అశ్వినీ దేవతలొ యేమొ
దివినుండి భువికి దిగినట్టి గంధర్వులో
లేక, విద్యాధరులొ, కిన్నరులొ, యెవ్వరొ, అని
శ్రీరామచంద్రుడాశ్చర్యాన కనులెత్తి
అద్భుతమ్ముగ వారి వీక్షించు చుండగా

అధ్వర్యువులు, రుత్విజులు, నిర్నిమేషులై
పులకతెల్తిన గాత్రులై చూచుచుండగా
గంధర్వ సంకాశులైన ఆ కుశలవులు
క్షణములో వీణలను శ్రుతి చేసి గొంతెత్తి
రామాయణము గాన మునుమొదలు పెట్టారు

వీణ నిక్వణములో గంభీర శ్రావ్యతకు
వారి శారీర మార్దవమైన రావమ్ము
తోడగుచు లుళితమై, లలితమై శ్రవణముల
విందగుచు సోలింప శ్రోతలు సుఖించారు

చుట్టు పట్టున గలుగు ప్రకృతంతయు గూడ
తన్మయత్వములోన నిండినట్లయినది
తరులతా గుల్మాలు ఆనంద బాష్పములు
రాల్చినట్లుగ నీటి బొట్లురాలిన వపుడు

ఈ రీతిగా రెండు వారాలు సాగినది
వారాంతమునకు పారాయణము ఆగినది
మంగళాంతాన ఆవాల్మీకి యేతెంచి
ఆశిషమ్ములగురిసె శిష్యద్వయముపైన

శ్రీరాముడానందమగ్నమానసుడగుచు
వాల్మీకితో నిట్టులనియె సంతృప్తితో

## సీతాదేవి ప్రాణత్యాగం

ఓరుషీ అశ్వినీ దేవతలవలె వున్న
ఈ కుమారుల జూచినప్పటినుండేను
నా కుమారులుగానె తలచు చున్నాడను
మీరలేమందురో సెలవిండు నాకనెను

అప్పుడా వాల్మీకి స్వస్తిరాజా నీకు
స్వస్తినీ ప్రజలకీ కుశలవులకును స్వస్తి
వీరిర్వురును నీకుమారులే సీతమ్మ
కన్నట్టి కవల పిల్లలు నీకు వారసులు

అనగానె రాముండు మందహాసము చేసి
ముఖమంత కంతకానందమ్ము దీపింప
ఓమునీశ్వర నేను జానకిని వెన్వెంట
నే, చూడవలెనంచు కోరుచుంటిని అనెను

అనగానె, వాల్మీకి ఆనందమును బొంది
ఓరామ యింతకంటెను శుభమ్మగు మాట
ఇంకేమిగలదంచు రేపెతెత్తునటంచు
కుశలవుల దీసికొని ఆశ్రమమ్మును చేరె

వెంటనే ఆనందముగ సీత బిలిపించి
జరిగిన విషయమ్ము కూలంకషముగ జెప్పి
అమ్మ సీతమ్మ నీ కష్టములు గట్టెక్కె
నేటితో నీనోము ఫలియించినది అనెను

తన యెడల ప్రభుదృష్టి మారినది అని తలచి
ఒక్కమారుగ సీత ఆత్మ ఉప్పొంగినది
వెంటనే అతనిపై నమ్మకము తగ్గి సా
ధారణమ్మగు దృష్టి వ ాయించె నప్పుడే

అదిచూచి వాల్మీకి హెచ్చరించుచు, వెడల
ప్రోత్సహించుచు ప్రయాణము కమ్ము అన్నాడు
నాటి బట్టలు దాచినట్టి బట్టలు గట్ట
నాటి సొమ్ములు పెట్టుకొన ప్రోత్సహించాడు
దారి చూపుచు ముందుగా తాను నడిచాడు

అంతఃపురపు దారికాదద్ది ఇప్పుడు
నేరుగా ఆదారి యజ్ఞశాలకు నడిచె
లోలోనఆయమకు సంశయము పొడమెను
శకునమ్ములను నమ్మినట్టి, సీతమ్మకు
తోచె దుశ్శకునాలు కలత జెందెను మనసు

పాత స్మృతులొక్కపరి తన్నుకొని వచ్చి
తన మనోనేత్రమ్ము ముందు నాట్యమ్మాడె
ముఖ్యదృశ్యము లంకలో తన్ను శ్రీరాము
డవమానమున ముంచినట్టి దృశ్యమ్మొకటి

తనకోసమై రావణుని వధించిన రాము
డాశతో తనకడకు పరుగెత్తుకొని రాక
తననె తానున్నచోటుకు తీసికొని రమ్మ
టంచు పురమాయించినాడా విభీషణుని

## సీతాదేవి ప్రాణత్యాగం

శోక తప్తమ్మునై , ధూళి ధూసరితమై
నట్టి దేహముతోడ, చెమట మాసిన చీర
రవికతో సంస్కార రహితమౌ జుట్టుతో
మనసు ఉరకలు వేయ సంభ్రమమ్మగ తాను
ఉన్నదున్నట్లుగా బయలు దేరెను అపుడు

ఆ విభీషణుడపుడు ఓయమ్మ సీతమ్మ
స్నానమ్ము చేసియు, దుకూల వస్త్రము గట్టి
సొమ్ములను ధరియించి రమ్మనెను శ్రీరాము
డని చెప్పగా తాను వేగమును తగ్గించి
ఎరవు బట్టలుగట్టి ఎరవు సొమ్ములు పెట్టి
చెప్పినట్లుగా చేసికొని బయలు దేరెను

దూరమ్మునుండి యే తనను చూచిన రాము
డాసనమునుండి దిగి ఎదురెదురుగా వచ్చి
పొదివి కొని తమకమ్ముతో కుస్తరించును అని
ఆశతో తానతని దగ్గరకు వచ్చినది

ఓర మోమిడి రాముడటువైపు చూచుచును
ఓ సీత! యుద్ధమున రావణుని చంపినది
నీకోసమా – కాదు – నాగౌరవము కొరకు
అని నిష్ఠురమ్ముగ మాటలాడెను అతడు

పరశరీర స్పర్శవలన కళంకితమైన
నీవు నాకికవలదు పొమ్మెక్కడికినైన
దశదిశలలో ఎక్కడికైన పోపొమ్ము

లక్ష్మణునితో పోదువా పొమ్ము వెంటనే
భరతునితో పోదువా పొమ్ము వెన్వెంట
శత్రుఘ్నునితొ పోదువా పొమ్ము పోపొమ్ము
లేక ఈ భీషణునితో పొమ్ముకాదేని
సుగ్రీవునితో పొమ్ము నాకొద్దు నీవింక
అనెను అందరి ముందు సిగ్గుమాలినవాడు
ముక్కుమొగమును ఎరుగ నట్లుగా ఆతండు

అవశురాలగు నన్ను ఆ రావణుని స్పర్శ
అంటినది అంతియేగాని నేనంటితిన
దానికే శ్రీరాముడంతంత అనరాని
కారుకూతలు కూసి హృదయాన్ని బాధించె

ఆమాటలును భర్త శ్రీరాము నోటిలో
నుండి వెల్వడి విషపు ములుకులుగ కాడినవి
హృదయమును మండించి రక్తమును ఎండించి
రక్త ప్రసారమును స్తంభింప జేసినవి

ప్రాణాలు ఎగిరి పోయినయట్లు సీతమ్మ
లక్ష్మణా నేనింక బ్రదుకదలపగ లేదు
చితిపేర్చు నేనందు ప్రాణాలు వదలుదును

అనగానె లక్ష్మణుడు రూక్షవీక్షణములను
రాము ముఖముపైన పరపెను విసుగెత్తి
ప్రళయకాలపు రుద్రువలెను మండుచునున్న
రాము మొగమును చూచి భయపడెను లక్ష్మణుడు

## సీతాదేవి ప్రాణత్యాగం

వెంటనే చితిపేర్చి మండించె లక్ష్మణుడు
బ్రహ్మ ప్రత్యక్షమై ఓ రామ ఈ సీత
అతి పవిత్ర పతివ్రతా లలామ మీయమ్మ
స్వీకరింపుము అనుచు నచ్చజెప్పెను నాడు

వీర శుల్కముగ తనను గెలుచుకొన్న వరుండు
తాను వరియింపగా తనకు వరుడైనట్టి
ఆరామచంద్రుడే నా యింత కఠినాత్ము
డై విషము క్రక్కినది శోచనీయముకదా!

శ్రీరాముడొక కామినాయందధిక కామి
భువనైక సుందరిని అందుకే  అతికామి
స్త్రీసుఖములేకుండ ఉండలేడొక క్షణము
అందుకే అడవికిని వెంబడించితి నేను

పెళ్లినాటికి యిర్వురికిని పదారేళ్లు
పెళ్లయిన వెంట నయోధ్య కరుదెంచాము
వచ్చినది మొదలు ఒకర్నొకరు వీడకను
అనుక్షణము ఏకాంతముగను సుఖియించాము

ఈలాగ పన్నెండు వత్సరమ్ములు గడిచె
అంతవరకును గర్భమేమొ రానే లేదు
లంకా నివాస మొక అనుమాన కారణము
నిజమునకు నాజీవితమచట పవిత్రమ్ము

రావణబ్రహ్మగూడా నీతిమంతుడే
నావిషయమందు మాత్రము నీతిమంతుడే
తన సోదరీ శూర్పణఖకు జరిగినయట్టి
అవమానమునకు ప్రతీకారముగ చెరపట్టి

నను లంకలో పెట్టెనాడంతె, అంతియే
ఒక క్షణముగూడా బలాత్కరించగ లేదు
నిత్యమును రామనామము జపముగా నేను
ఆవత్సరము ఒక్కయుగముగా గడిపాను

లంకనుండి అయోధ్య వచ్చుదారిలోగాని
అంతఃపురము జేరినట్టినాడే గాని
నేను గర్భమును దాల్చినట్లుగా నా గుర్తు
అదె రామునకు మూల అనుమాన కారణము
పెళ్ళయిన యెన్నెన్నో వత్సరాలకు గర్భ
వతులైన యట్టి ఉదాహరణలెన్నెన్నొ

దశరధుని చాల యితె సంతు యోగ్యతలేదు
రాముడా దశరధుని పుత్రుండు కాడు గద
భరత శత్రుఘ్నులకు సంతాన ముందిగద
అయిన రామునికేల అన్ని అనుమానాలు
తాను దొంగైనచో ఇరుగు పొరుగును నమ్మ
డను సామెతగ రాముడనుమాను పడ్డాడు

పురుషునికి ఒక నీతి స్త్రీకి వేరొక నీతి
నాటికిని నేటికిని ఇదొక వక్రపు నీతి

దశరథ మహారాజు రోజుకొక పరిణయము
చేసుకొనువాడు గద అతని తాతలు గూడ
ఎన్నెన్నొ పెళ్లిళ్ల చేసుకున్నారుగద

రాముడికి మాత్రము స్త్రీలు ఎందరు లేరు
అరణముగ నావెంట సౌందర్యవతులయిన
యౌవనాంగులు రామునకు ఈయబడలేద?
రాముండరణ్యావాసము కేగు సమయాన
రామునంతఃపురమునుండి స్త్రీరోదనలు
వినవచ్చెనాలేద? ఎవరివా రోదనలు
అట్టిరాముడు నాదు శీలమును శంకించి
మోసముగ గగనాల పాల్జేయ నీ తగున?

నాగర్భమును గూర్చి ఎంతనాటకమాడె
నేను చెప్పక ముందె గర్భమును కనిపెట్టి
గర్భమునుతడివి ఒక నిమిషమాలోచించి
ఓ సీత గర్భిణికి కోరికలు ఉండుగద
నీవిటీవల కోరినట్లుగా మున్యాశ్ర
మాలు చూడగ నిన్ను పంపుచుంటిని అనెను

అన్నట్లుగా మోసముగ పంపెరాముండు
ఇప్పుడిన్నేళ్ల తర్వాత కబురంపాడు
అదిగూడ వాల్మీకి ముని పుంగవుని చేత

ఈలాగ తలపోసి సీత కిందికి చూచి
కాళ్లు తడబడుచుండగా నధోదృక్కులతో
మునివెంట అడుగులో అడుగేసుకొని నడిచె
ఎదురుచూపుల రాము ముఖమును పరికించె

ఆవాహనము, తిరస్కారమ్ము ఏవియును
లేనట్టి దృష్టితో రాముడామెను చూచి
ఎదురుగా వున్నట్టి సామంతులను చూచి
రాజ ఉద్యోగులను బ్రాహ్మలను, పౌరులను,
వాల్మీకి ముని చూచి, ఇతర రుషులను చూచి
సీతనుద్దేశించి యిట్టులనె బిగ్గరగ

ఓ సీత! యెప్పుడో లంకలో అగ్ని ప్ర
వేశమును చేసి నీ స్వచ్ఛతను చాటావు
నాటి జనములు వేరు నేడు మన జనములు
వినుచుండ కనుచుండ మరల నీ స్వచ్ఛతను
రుజావు చేసిన యెడల స్వీకరింతును మరల
అనుచు సీతను చూచి నిష్కర్షగా అనెను

అనగానె సీతమ్మ పదిరి పోయెను మరల
ఏమిటీ రాముండు నా ప్రాణములతోడ
చెలగాటమాడుచున్నాడు క్రూరమ్ముగ
పురుషుడైతేనేమి ఇంతహంకారమా
అనుకొంచు మదిలోన రోదించె సీతమ్మ

గురు సన్నిధిని పుత్ర సన్నిధిని, జనముల
మధ్య ప్రకృతుని వలె ఆ రాము డటువలక
అనుమాన మిసుమంత తగ్గనట్లుగ పలుక
బానిసను వలె తూష్ణీం భావమున పలుక
పాత ధోరణి పాత మనసు వదలక పలక

ఆ పలుకులు ములుకులై చెవులు చూడిన యట్లు
హృదయమందున గాఢముగ కాడు కొన్నట్లు
గానవుచు హృదయమ్ము అల్లాడిపోయినది

మిన్ను విరుగుచు మీద పడిపోవదేమి అని
భూమి ప్రద్దలు అగుచు ననుమింగదేమి అని
ఈ ప్రాణముల నింక భరియింపలే ననుచు
భూమిపై రాలి ప్రాణములు వదలెను సీత

# తాటక

సతీ తాటక యక్షకాంతా
సుతులు మారీచుడు సుబాహుడు
మాతృ శత్రువు విశ్వమిత్రుని
సత్రయాగం పాడు చేసిరి

అతడయోధ్యా నగరి పరుగిడ
దాశరథులను వెంటనిడికొని
అస్త్ర విద్యల నార్చి తేల్చి ప్ర
శస్తులను గావించినాడు

వారు యువకులు అస్త్ర విద్యా
వర పరీక్షా ఫలముగా మా
రీచు బాణోక్షిప్తుచేసి, సు
బాహు ప్రాణములనాహరించిరి

చూచినది రెచ్చినది తాటక
తాచినది కొండలను పిండిగ
నోరుచేసుకు చేయి చేసుకు
వారిపై విసిరింది బండల

వృక్షముల పెకలించి కొండల
పేటులను పెకలించి విసరెను
ఉరుములురిమిన పగిది రొప్పుచు
కురియ సాగెను రాళ్ల వర్షము

**తాటక**

రోషభీషణ రూప తాటక
రూక్ష వీక్షణములను చూచుచు
గురువు విశ్వామిత్రు నాజ్ఞను
క్రూర నారాచముల నేసిరి

బాణముల యేటులకు నొచ్చిన
తాటకాసతి అలిసి పోయెను
రొప్పుచును రోషమున కాగుచు
క్షనలి ఆ సోదరుల తాకెను

వెంటనే ఆరామ లక్ష్మణు
లిర్వురామెను ఒడిసి పట్టిరి
రెండు చేతుల నరికి వేసిరి
ముక్కు చెవులను కోసి వేసిరి

దెబ్బతిని బెబ్బులి విధమ్మున
రెచ్చి యెగిరెను అంత యెత్తున
అంత యెత్తున రామలక్ష్మణు
లాశుగమ్ములతోడ నేసిరి

వేయి యేన్గుల బలము కలిగిన
యోషితామణి ఘీంకరించుచు
క్షోణిపైబడి బుసలు క్రక్కుచు
ప్రాణములు వదిలింది పాపం

ఆమె యాడుది యుద్ధ సన్న
ద్ధమున లేనిది అకస్మాత్తుగ
ఉరుములేకనె పడుగుపడిన, వి
ధాన జరిగెను దండయాత్ర

పుత్రహననము చూచి కోపము
పొంద తల్లికి సాజమేగదా!
అట్టి తల్లిని చంప చేతుల
వెట్టువచ్చెను ధర్మపరులకు

స్త్రీని చంపుట పాపమను సం
దియము వలదనె విశ్వమిత్రుడు
గోబ్రాహ్మణ హితంకోసం
తాటకావధ ముఖ్యమనెను

అంతమాత్రమె కాదు చాతు
ర్వర్ణ్యరక్షణ రాజకార్యం
అనుచు విశ్వామిత్రుడే అనె
నంచు వాల్మీకే లిఖించెను

బ్రాహ్మలకు ప్రత్యేకముగ తా
పాపమేమియు చేయలేదే
గోవులకు ప్రత్యేకముగ తా
ఘోరమేమియు చేయలేదే

ఎందుకని గోబ్రాహ్మణ హితం
కోసమై తాట కనుచంపు మ
టంచు పల్కెను విశ్వమిత్రుడు
చంపజేసెను క్రూరపద్ధతి

## తాటక

స్త్రీని చంపుట ఘోరపాపం
హీనకార్యం బనెను వేదం
వేదరుక్కులకు కర్త విశ్వా
మిత్రుడే చేయించె పాపం

తాటకాంతక రామ అని భజ
నలను చేసే ఆడభక్తుల
మూఢ భక్తుల నేమనంగా
వలెనో చెప్పుడు మీకు తోస్తే

యజ్ఞమంటే ధేను విశసన
మౌనగాదా, హింసగాదా
లేదనందువె చూడు బాబూ
వేదమేమని చెప్పుచున్నదో

అగ్నికనుగొన్నాక మాంసం
అగ్నిలో వేల్చుట యజ్ఞం
అగ్నికుండంలోన మాంసం
ఆహుతిచ్చిన తాటకేయుల
చంపుటకు కారణమటంచును
చెప్పుటది నిర్హేతువాదం
యజ్ఞయాగములందు హింసను
అడ్డుకొనుటే బౌద్ధ పద్ధతి
అడ్డుకొని యెడి వారినెల్లను
చంప జేయుట బ్రాహ్మణుల విధి

# శూర్పణఖ

రావణాసురు చెల్లెలగు శూ
ర్పణఖనామ శుభాంగి యౌవన
సుందరాంగి అమందభాగిని
దండకావన రాజ్యరాజ్ఞి

తమవనమ్మున కెవ్వరో తమ
కను గుణాత్ములు కానివారలు
వచ్చినారని భయకుతూహల
చిత్తమున జనె చూడ నచటికి

పర్ణశాలాభ్యంతరమ్మున
భామినీమణి సీతగాంచెను
పర్ణశాలకు ముందు వలపలి
పార్శ్వమున శ్రీ రాముగాంచెను

శూర్పణఖ బహు అందకత్తె
ఉన్నదున్నట్లుగనె వచ్చెను
కామరూపు ధరించెనంటని
కాని మాటలు పలికి నారలు

ఎన్ని విద్యలు వచ్చితేనేం
లేని రూపు ధరించు టెట్లగు
ఇంతనాలుక ఇంత పెదవులు
ఇంతనాసిక అనిరి వింతగ

**శూర్పణఖ**

చేటగోళ్లని చింకి జుట్టని
కోరపళ్ల కరాళ వక్త్రని
తప్పు చూపుల పెద్ద మనుషులు
చెప్పినారు మరింత వింతగ

ఆర్య జాత్యాధిక్యభావం
అంతులేకనె వుండుగాక
రామసీతా లక్ష్మణాదుల
పైమమత్వం వుండుగాక
అంతెగానీ ఇంత వింతలు
వింత కూతలు కూసిరెందుకు?

ఆర్యజాతుల యందు చాలా
అంద ముండును అనుటతప్పు
అంతకంటే అందమెక్కుడ
నార్య జాతుల నంట ఒప్పు

రాము జూచెను అందమున కం
దమ్ము వాడని చూడసాగెను
తనదు ఇంద్రియములను మరిచెను
భ్రమానుపడి శూర్పణఖ నిలిచెను

మెల్లమెల్లన ఇంద్రియమ్ముల
వెల్ల వశమును పొందుకొలదిని
అల్లనల్లన ప్రేమ భావము
కొనలు సాగెను, కోర్కె రేగెను

అబ్బురమ్ముగ రాము కన్నుల
నిబ్బరమ్ముగ కనుచు మదిలో
ఉబ్బి వచ్చెడి ప్రేమ కుత్తుక
తన్నుకొని పై కుబ్బి వచ్చెను

మగని వరణము చేయు హక్కులు
మగువలందర కుండె నప్పుడు
శూర్పణఖ ఆరాము నందము
చూరగొనగా సిద్ధమయ్యెను

పద్మనేత్ర వినీల కాంతులు
పద్మనేత్రుని పైన బరచుచు
మందగమనముతో నమందా
నందమున సమ్ముఖము చేరెను

హస్త పల్లవ యుగ్మమున వి
న్యస్తబాణుని రామచంద్రుని
చెంపజంటను నిమిరవేళ్లను
కణతలకు నొక్కుకుని నవ్వెను

వల్కలావృతుడైన రాముడు
చకితుడై ఆయమను నెట్టెను
ఎంతబలమున నెట్టెనో అది
అంతబలమున కౌగిలించెను

**శూర్పణఖ**

ఊహ చేయని రీతిలో ఉప
గూహనమున బిగించగా శ్రీ
రాము డుక్కిరి బిక్కిరిగనై
పర్ణశాల ముఖమ్ము చూచెను

సీతగానీ లక్ష్మణుడు గా
నీ తదన్యులు గాని, యెవ్వరు
చూడలేదను ధైర్యమున శ్రీ
రాముడామెను పల్కరించెను

గుండె నిండుగ విషము నిడికొని
గొంతు నిండుగ బెల్లమిడికొని
నాల్కనుండి మరంద బిందువు
లొలక చేసెను అతని పలుకులు

ఎవతెవే ఓ సుందరాంగీ
ఏమిటీ దుందుడుకు తనము
నేను రాము డయోధ్యరాసుతు
డేను దశరథ ప్రథము పుత్రుడ

తండ్రి పనుపున అటవి వాసము
దండ కావని కేగుదెంచితి
పెండ్లమున్నది సీత, అయినా
బ్రహ్మ చర్యము నున్నవాడను

ఆర్య రుషుల తపోవనవమ్ముల
నార్య ధూర్తల నుండి రక్షణ
సేయగా నేతెంచినాడను
దీక్షగైకొనియున్నవాడను

గోవులను బ్రాహ్మణులరక్షను
చతుర్వర్ణము రక్షకొరకును
బద్ధకంకణుడైనవాడను
దండకావని వచ్చినాడను

చెంత భార్యను లేనివాడా
చెంత నున్నాడదిగో చూడుము
చందురుని నీవెంత లెమ్మను
అందచందము వాని చూడుము

విల్లు నెక్కిడి సావధానము
నెల్ల దిక్కుల కలయ జూచుచు
తిండి నిద్రను వదిలి నిత్యము
రక్షసేయును పర్ణశాలను

చిన్న తమ్ముడు లక్ష్మణాఖ్యుడు
నన్ను మించిన అందగాడే
అతని చెంతకు ఏగి ఆతని
మదన లీలల తేల్చు మనియెను

శూర్పణఖ

అనిన రాముని మొగము జూచుచు
మనసులోన చివుక్కుమనగా
''ఔర రాజా! నిన్ను మగవా
డవుగ భావన చేసి వచ్చితి
పుంస్త్వమున్న మగాడి నోటను
వచ్చునా యిట్లాంటి మాటలు

నిన్ను మాత్రమె కోరి వచ్చిన
నన్ను పరులకు తార్పనెంచిన
షండనీతికి పాల్పడిన పా
షండుడవు అనినీతి పరుడవు

ఉన్నమాటను అన్నయప్పుడు
ఉలుకు కలుగును ఎవరికైనా
గతములో ఒకసారి పాపం
సీతయే తిట్టినది పాపం

హృదయ భేదకమైన శూర్పణ
ఖాదవానల తుల్య వాక్కులు
మర్మభేదము సేసి హృదయము
మంటలను మండింపజేసెను

ఎడదమండీ, ఒడలు మండీ
కనులు మంటలు మండి మండీ
ఉచ్చమైన స్వరాన ''హా, ల
క్ష్మణా'' యంచును కేకవేసెను

రోషభీషణ కాతరస్వర
మొక్కపరిగా, సీతలక్ష్మణు
ఊపిరులు స్తంభింప జేసెను
సరభసమ్మున సీత పరుగిడె!
ఉరక లెత్తుచు గసలు కక్కుచు
సాయుధుడు లక్ష్మణుడు పరుగిడె!

వీరుడా శ్రీరామచంద్రుడు
వీర లక్ష్మణు దిక్కుచూచుచు
సంజ్ఞ చేయగ అర్థమై – ల
క్ష్మణ కుమారుడు కత్తి దూసెను

శూన్య దృష్టుల చూచుచుండిన
శూర్పణఖపై ఎగిసి పడెను
ముక్కు కోసెను, చెవులు కోసెను
ముక్కలను అటు విసరి వేసెను
ఎంతమోసం, ఎంతకపటం
ఎందరారుణ క్రూర కర్మం!!

ఊహ చేయని రీతిలో తన
దేహమునకును అంగములకును
జరిగినట్టి అహీన హింసకు
స్తంభనము శూర్పణఖ పొందెను

## శూర్పణఖ

ముందు భాగము ఉభయ పార్శ్వ
మ్ములను, వెనుకను కారు రక్తము
కాల్వలై, ఎరుపైన బురదగ
నై, జుగుప్సను కలగ జేయగ

ఆరిపోయెడి కొలదిగను, గా
యాలు మంటలు గ్రక్కగా కో
పానల జ్వాలా జ్వలితము
ప్రాణ వాయువు బుసలు గ్రక్కగ

రెండు కోడెల మధ్య నలిగే
దూడరీతిగ అంగలార్చుచు,
పారిపోయెను భయ భయంగా
వెరగుపడి సీతమ్మ ఆర్వగ

కోరివచ్చిన నారి నాసిక
కోయనచ్చునె చెవులు తోడుగ
అంతకసిగా ప్రవర్తింతురె?
అంత హీనులు గొప్పవారే??

ఇదీపాపం శూర్పణఖ కత
ద్రావి డాంగన శూర్పణఖ కత
విరూపను చేసేసి రాక్షస
రూపమును పొందినదటంచును
కాని పలుకులు పలికి నారలు

ఇదీ పాపం శూర్పణఖ కత!!!

# కైక

పక్షపాతము సాజమే వల
పక్షముండుట కొంత సహజము

దశరథేశుని పక్షపాతము
ధర్మమయ్యెను వేద (రుషులకు)
కైకదగు నిష్పక్షపాతము
కాని దయ్యెను ధర్మపరులకు

కైక, పాపం, మొదటి నుండీ
కన్నకొడుగుగ రాము జూచెను
రాముడామెను కన్నతల్లికి
మారురూపమటంచు తలచెను

అమృత ధారలు కురియు హృదయము
లందు విషమును చల్లిరెవ్వరు
స్వచ్ఛహృదయము లం దసూయా
వర్షమును కురిపించిదెవ్వరు

(ఎవ్వరది కౌసల్యయా? మరి
యెవ్వరది కైకేయియా? మరి
యెవ్వరది కులగురువసిష్ఠుడె॥
ఇంక యెవరది? దశరథేశుడె!)

కైక

భరత శత్రుఘ్నుల్లను వేరే
దూరమౌ గ్రామముల తోలెను
యేమితొాందర వచ్చినది శ్రీ
రామునికి పట్టమును గట్టగ

యౌవరాజ్యపుపట్టమంటే
అంత తేలిక కాదుగాదా
అందరికి, ప్రజలందరికి సం
బంధ బంధువులకును తెలుపరె?

కాని యియ్యది యేమి గూడుపు
ఠాణియో యెరుగంగరాదు
కైకకేనా – కాదు – నంది
గ్రామ బంధువులకును తెలియదు

కైక ముద్దుల సతి యటందురు
కైక మాటను దాటడందురు
ఏలమరి యా దశరథేశుడు
ఎందుకని వంచించెనామెను

నాటి న్యాయము బట్టి చూచిన
నాన్న వారసుడగ్ర పుత్రుడు
అగ్రజుడు బ్రదికుండగా అను
జన్ములకు లేదవని పాలన

ధర్మమర్మము లెరిగినది, కై
కమ్మ సద్గుణరాశి, త్యాగిని
తనదు సుతు పట్టాభిషేకము
మనసునైనను తలపనట్టిది

అట్టికైకను పక్షపాతిగ
సృష్టిచేసిన దుష్టుడెవ్వడు
లేని తప్పులనెల్ల నారో
పణము చేసినక్రూరుడెవ్వడు

అసలు దొంగలు యెవ్వరంటే
ఆవసిష్ఠుడు దశరథేశుడు
తెలిసిగూడను దొంగలౌ కౌ
సల్య, రాముడు, లక్ష్మణాదులు

నగరిలో అంతఃపురములో
ఎంత పండగ, ఎంత సందడి!
ఆ హడావుడి చూచి కైకకు
అచ్చెరువు, అనుమాన మయ్యెను

అరణముగ తనతోడ అంతః
పురము వచ్చిన మంథరంటే
కైక కెంతో ప్రీతి మంథర
కామె అంటే అంత ప్రీతే

కైక

పురమునందున మనదు అంతః
పురమునందీ సందడేమిటి?
మంధరా అదియేమిటే, మరి
తొందరగ కనుగొనవె, చెప్పవె

అనుచు తొందర చేయగా కై
కమ్మ మొగమును చూచి మంథర
అచ్చెరువు ముఖమందుతో పగ
సరభసమ్మున వెడలి పోయెను

కోటగుమ్మము మామిడాకుల
కోటవలె కన్పడగ జూచెను
ఉభయ పార్శ్వములందు రంభా
స్తంభములు శోభిల్ల గాంచెను

ఆడనుండి సభాంగణమునకు
మడుగుచీరల పరపు చూచెను
మడుగుచీరల పరపులకు ఇరు
గడల పూవుల వరుసగాంచెను

అందముగ ఆకాశమంటెడి
ఛాందినీ మేల్కట్టు చూచెను
దశరథేశుని సభాంగణ మం
దలంకరణము లెల్ల జూచెను

రంగు రంగుల పూల మాలా
లంకృతా వరణముల గాంచెను
మందగమనులు మందహాసులు
మంత్రి సామంతులను చూచెను

మందహాసానంద శోభిత
మందగమన లమంద గతిలో
పూలు, కుంకుమ, పసుపు, గంధము
మోసుకొని పోవుటలు గాంచెను

వింతగూరిన వేడ్కతో కౌ
సల్య గృహమున కరిగి చూచెను
అందు కౌసల్యా సుమిత్రా
నంద భరమున నుండ జూచెను

సరభసముగా హడావుడిగా
తిరుగు పరిచారికల గాంచెను
వారినడిగెను అసలు విషయం
వీరి నడిగెను తెలుసుకొనెను

బాధగా ఆశ్చర్య పూరిత
హృదయగా వెనుదిరిగి యేగెను
వేయి కన్నులతో నిరీక్షణ
చేయు కైకను చేరుకొనెను

కైక

మెల్లగా కౌసల్య సుతు ప
ట్టాభిషేకమటంచు చెప్పెను
ఏమి విన్నది కైక తన చెవు
లేమి విన్నవి నమ్మ ద గునె!!

దశరథేశుడుగాని, కోసల
దేశరాజ్ఞియు గాని, రాముడు
గాని యెవ్వరుగాని తనకొక
మాట చెప్పగలే దదెందుకు?

గురుడు, ఊర్వశిసుతు వసిష్ఠుని
కరుణ వల్లను రామలక్ష్మణ
భరత శత్రుఘ్నులును కలిగిరి
పక్షపాతం వుండనగునె?

తలచు కొలదిని రోషభీషణ
తాకులమ్మై హృది జ్వలించెను
నిండు గుండెలు మండి దేహము
నెల్ల దహనము చేయజొచ్చెను

మానమున అభిమానమున అవ
మానమున మది క్షోభమందెను
కనుల జంట కషాయ దీధితి
క్రమ్మి అగ్నిని కురియ సాగెను

సెగలు ప్రాకిన సర్వదేహము
పొగిలి పొగలను వెడల జేసెను
రోమ కూపము లన్ని విరిసి వి
లోల ఘర్మ జలమ్ము లూరెను

నొసటి కుంకుమ కరిగి అలికిన
రక్తమై వ్యాపింప దొడగెను
ఉబ్బు కోపము ఎడద పట్టక
కంఠమున కెగదన్ని నిలిచెను

రొప్పుచును గద్గదిక రవమున
శోక తప్తముగాగ పలికెను

ఏమె ! మంథర ఇంత అన్యా
యమును మనపై రుద్దినారే
ఏమి పాపము చేసినారము
ఏమి తప్పును చేసినారము

కోసలేంద్రుని యెడల నెంతో
కూరిమిగ వర్తించు దానను
అక్క కౌసల్యమ్మ నెంతో
అతిగనే ప్రేమించుదానను

సుమిత్రమ్మను ప్రేమగా అతి
ముద్దుగానే చూచుదానను
రామలక్ష్మణులన్న, భరతుని
కన్న మిన్నగ చూచుదానను

కైక

బిడ్డ శత్రుఘ్నుణ్ణి యెంతో
ముద్దుగా పెంచినది నేనే
నాకు చెప్పక యింత పండగ
నేల తలపెట్టెను మహీశుడు

అంచు, తాపము హెచ్చుగా బుస
లార్భటిల్లగ సర్పిణి క్రియ
పరిక్రమణము చేసి ద్వారము
పైకి చనిఅటు పారజూచెను

స్త్రీలు పురుషులు సరభసంగా
తిరుగునంబరములను చూచెను
విన్నదానికి కోటి రెట్లకు
మిన్నగా కన్పడగ జూచెను

రేగినవి మంటలు సముజ్వల
హేతులై హృదయమును గాల్చెను
ప్రజానాధుడు దశరధేశుని
పైన కసి తీవ్రముగ బూనెను

తీవ్ర కోపజ్వరముచే, తను
వెల్ల వణకగ తూలుచును, కో
పగృహాంతరమేగి అటకో
పంపుపానుపు పైన పడెను

వెంటనే తెలిసింది దశరథు
కంట భయమట ఆవహిలినది
గుట్టు రట్టయి పోయెనని భయ
గుణిత పశ్చాత్తప్తు డయ్యెను

తాను పురుషుడు, అంతియేనా?
ధాత్రినాధుడు, తనకు ఎదురుగ
మాటలాడెడి శక్తి యెవరికి
గూడ లేదది సర్వవిదితము

అయిన, దశరథుడేల భయపడె
తప్పుచేసిన వాడు గావున!
తప్పుచేసిన గుణుడు పశ్చా
త్తప్తుడగుటే గుణము గావున

కుప్పగూలిన యట్లు భూపుడు
చప్ప చల్లారిన విధమ్మున
ఏమితోచక దారిగానక
శూన్య దృష్టుల చూడసాగెను

కొంతవడి చింతించి, మనసును
కూడదీసుకు నెమ్మదిగ తన
కూర్మిసతి కైకమ్మ జూడగ
కామమున కోపగృహము కేగెను

## కైక

చూడగా నే కైక, చేతుల
తోడ కన్నులు కప్పికొని అటు
తిరిగి పడుకొని గాఢముగ ని
ట్టూర్చి కసరెను దశరథేశుని

దశరథుండతి సానుభూతిగ
తమకమున తన వణకు చేతుల
సాచి తత్కరములను లాగుచు
సామముగ నిట్లనుచు పల్కెను

ఏల నే కైకమ్మకోపము
నేలపూనితి వింతదుఃఖము
నేల పొందితి వేమి జరిగెను?
ఏమి అపకారమ్ము జరిగెను?

అనుచు దశరథుడనెనొ లేదో
మానినీ మణి కైక దశరథు
కరములను విదిలించి వేసెను
లేచి రొప్పెను భుజగి రీతిని

నాకు కోపము యేల కలిగెనో
నాకు దుఃఖము యేల కలిగెనో
ఏమి తెలియని నంగనాచిగ
యేమిటా మాటలు మహీశా!

అనుచు రొప్పిన కైక ధోరణి
కనుచు క్రుంగిన దశరథేశుడు
నిర్బలుండై చదికిలంబడి
నిబ్బరించు మటంచు వేడెను

తప్పు రాజా వీధిలో, తల
దన్ని ఇంటను కాలుమొక్కుట
సవతులందరు చూడ జరిగిన
అవధిలేని అవజ్ఞ సైపను

రామభరతులు ఏక బీజో
త్పన్నులగుటే గాదు రాజా!
ఇరువురను నాపాల బెంచితి
రెండు చంకల వారి మోసితి

మాట మాత్రమ్మైన చెప్పక
రాము పట్టము నెంచి నాడవు

అనగ – మొగమోట మిగ పల్కెన
టంచు తలచిన దశరథేశుడు
పాలనా వ్యవహారములలో
వ్యవధి లేకనె యంచు బలికెను

దొంగ పలుకులు ములుకువై చెవి
దోయి పుటముల కాడుకొనగా
తోక తొక్కిన త్రాచు రీతిగ
పైకి లేచెను బుసలు క్రక్కను

కైక

తప్పు చేసెడి ప్రజల కెల్లా
దండనము విధియించురాజే
తప్పు చేసిన అతని కెవ్వరు
దండమును విధియించగలరు?

ఔర రాజా వ్యవధిలేదని
అంటిరి గదా, అంతియేనా
అంత దూరమునుండి యీ సా
మంతరాజులు యెట్లు వచ్చిరి

దూర బాంధవు లెల్ల మొన్ననె
చేరినారిది యెట్లు జరిగెను
మీరు వారును ఏకకాలము
నందు కలలను కనుట జరిగెనె?

సంబరంబది యెంతదైనా
సన్నదైనా పెద్దదైనా
బంధుమిత్రుల కందరికి కబు
రంపకుండా యెవరు చెయ్యరు

తాడినెక్కెతి వెందుకంటే
దూడ గడ్డి కటన్న రీతిని
ఏల రాజా కాని మాటలు
ఎంత పాపము చేసినారలు

తెలిసి గూడా భరత శత్రు
ఘ్నులను దూరం పంపినారలు
నాదు సోదరులకును ఆహ్వా
నమును పంపక యుండినారలు

ఏక లగ్నమునందు బుట్టిన
బిడ్డలంతా ఒకటి గాదా?
ఒకరి యెడ వలపక్షమూనే
తల్లిదండ్రులు ద్రోహులే గద!

మీరునూ కులగురు వసిష్ఠుల
వారునూ ఒకతోడుదొంగలు
కాని రీతిని గూడి గూడు పు
ఠాణి కావించిన విరోధులు

ఎట్టిదో, విద్రోహమును తల
పెట్టినట్లున్నారు మీరలు
ఏదియో, మావలని భయమును
శంక చేయుచునున్నవారలు

అనుచు చూపులు సూటిగా తన
కనులగ్రుచ్చిన కైక కనులను
చూచి రక్తారుణ ద్యుతులను
గాంచి భయపడెదశరథేశుడు

కైక

తేలుకుట్టిన దొంగలాగా
బాధ బయటికి కక్కలేకను
మెల్లగా, ఒకనాడు నీ వర
ములను కోరితిగాదె యనెను

వెంటనే అది ఉపశ్రుతిగా
అంటుకున్నది, తట్టెలేపిన
చందమున మైకమ్ము తొలగిన
చందమున కైకమ్మ యిట్లనె

ఔను రాజా, ఇంతవరక
జ్ఞాన రీతిని మసులు కొంటిని
జ్ఞాపకము లేదనుట కాదు,
జ్ఞాపకం వున్నవి వరమ్ములు

ఇంత కాలం నిన్ను నమ్మి, మ
రింతగా, నే, మోసపోతిని
మాయ మర్మము తెలియకను, నీ
మాయ కనుగొన లేకపోతిని

తగిన శాస్తిని చేసితివి, యిది
తగునె నీకిది దశరథేశ!
నేను నీ ప్రేమంపు సతినా!
ఔన కాదా, నిజము చెప్పుము

ఔనులే బహు భార్యలకు పతి
వైన నీకాధైర్యముండునె?
బహుస్త్రీలోతాత్మలకు ఏ
కత్రితమ్మగు ప్రేమ సాధ్యమె?
రోజుకొక పెండ్లమును పొందే
రాజునకు సతి ప్రేమ యేమిటి?

కీర్తి పురుషుడు ఘనత కెక్కిన
కేకయావని నాథదుహితను
నాకె యింతపకారమును, తల
పెట్టితివి, నేనుపశమింపను

ప్రేమ భావం త్యాగభావం
తప్పద్వేషం లేని హృదిలో
ఇంతకోపం ఇంత అక్కసు
ఎంతకాలం నుండి దాగెనో
భర్త చేసిన అపకృతకై
ప్రతిక్రియగా యిట్టులన్నిది

వినుము రాజా వినుము, ఒక వర
మునను రామునరణ్యగమనము
మరొక వరమున కోరుకొందును
భరతునికె పట్టాభిషేకము

అనెనొ లేదో దశరథేశుని
కనుల జంటను బాష్పకణములు
జాలువారగ నేల గూలెను
కుప్పగూలిన కుజము రీతిని

## కైక

తర్కమాడగ మెదడు మొద్దై
భాషముద్దయి చూపు గుడ్డై
కదలకను మెదలకను భూపతి
పృథివి బడి, చైతన్యముడిగెను

ప్రాణమునకును మానమునకును
బద్ధ సఖ్యం, పరువు ముఖ్యం
మానధనునకు మానమెడలిన
ప్రాణమెడలిన యట్టులగును

జ్వరము తీవ్రత సంధికొట్టిన
మానవుని ప్రేలాపనల వలె
రాము డడవికి యేగు కైకా
భరతుడిక రాజనుచు పలికెను

ఏమి విన్నది కైక తన చెవు
లేమి విన్నవి ఎంత జరిగెను?
నిజముగా తన హృదయమందున
ఇంత వింతగు కోరికున్నదె?

ఎప్పుడైతే రాము డడవికి
యేగునని రాజని యెనో తన
చెవులలో బాణములు కాడిన
చందమున కైకమ్మ వణికెను

రాజు దైన్యంచూచి కేకయ
రాజ సుత కైకమ్మ యేడ్చెను
కడుపులో చెయి పెట్టిదేవిన
వడువుగా దుఃఖమును పొందెను

కాని దేమో కోరినట్టుగ
కానిదేమో జరిగినట్టుగ
దిక్కు తెలియని రీతిగా దశ
దిక్కులను పరికించి మ్రాన్పడి

ఏమి రాజా యేమి టంటివి
రామునడవికి పంపుతావా
వద్దు రాజా వద్దు, అడవికి
వద్దు వద్దని కైక యేడ్చెను.

రాణి యేడ్చెను రాజుపైబడి
రాజు వాలెను కైక సందిట
కనుల నీటి ప్రవాహముభయుల
వెన్నుపూసల తడిపి పారగ

బాష్పజలములు ఇంకి పార
స్పరికమనసులు చల్లబడగా
ఒకరి నొకరు పరీక్షగా కను
గొనుచు నిశ్చేష్టులుగ నుండిరి

కైక

ఎంత సేపటినుండి రాముడు
ఈ స్థితిని పరికించు చుండెనో
సరభసమ్మున తల్లిదండ్రుల
సమ్ముఖమ్మున నరుగు దెంచెను

రాము జూచిన తల్లిదండ్రులు
సిగ్గుపడి బంధముల వీడిరి
తలలు వంచుక శూన్యదృష్టిని
తలలు పట్టుక కూరుచుండిరి!

తల్లి కేకయ రాజ తనుజా!
తండ్రి కోసల రాజ్యనాథా!
ఏల మొగమును చాటు చేసుకు
ఇంతవంతల కూరుటెందుకు
మీర లిర్వురయందు లేశము
గూడ తప్పును లేదటందును

ఔను మాతా మరచినావా?
అసురులను చంపంగ వలెనని
నన్ను కోరిన విధము, గతమున
నాకు జ్ఞాపకమున్నదిపుడును

గురువసిష్ఠుడు, గురుడు విశ్వా
మిత్రులిరువురు రాక్షసారులు
ఆర్య శత్రుల సంహరింపగ
అస్త్ర విద్యల నేర్పినారలు

ఘన భుజమ్ముల వాడగు సుబా
హునిని చంపితి ఒక్కదెబ్బకు
అనిలమగు బాణమున మారీ
చుని సముద్రము మద్యనేసితి

చండవహ్నిజ్వాల నేత్రను
తాటకను పరిమార్చినాడను
శివుని ధనువును విరిచి వీర
త్వమును ప్రకటన చేసినాడను

ఈ అనార్యుల చంపుటకు నే
నెంతయో ఉత్సుకత నుంటిని
తల్లిదండ్రుల కోరికే అది
తమ్ములందరి అభిమతమ్మది

చుట్టుపట్టుల శత్రునివహము
పెట్టుకొని రాజ్యమును స్థిరముగ
నుంచుకొను డెట్లగునటంచును
ఎంచుకొంటి ననార్యవధమును

అంతెగాదు మరొక్క కారణ
మదియ బ్రాహ్మణ హితార్థం
వర్ణధర్మపురక్షణార్థమ
నార్య వధనెరవేర్చగావలె

కైక

అనుచు రాముడు సరభసంగా
అడవికేగగ బయలు వెడలెను
అతనితోడుత ఆర్యభామా
రత్నమగు సీతమ్మ వెడలెను

భరతురాజౌగ చూడలేక, సు
మిత్ర పుత్రుడు గూడ వెడలెను
ఉండుమనుటకు పొమ్మ్మ అనుట
శక్తి లేకను రాజు కూలెను

ఆదికవి వాల్మీకి చెప్పిన
అసలు కథయిది కైక కథయిది
అజ్ఞాలెల్లరు ఆడిపోసిన
ఆమె సఖిమంథర కథేయిది

# అయోముఖి

పంచవటిలో నున్నయప్పుడు
పంచరంగుల జింక కనబడె
చూడగనె సీతమ్మ దానిని
పట్టుకొనగా రాముకోరెను

రాముడా హరిణమ్ముతరుమగ
దక్కినట్లే పారిపోయెను
విసిగి పోయిన రాముడంతట
విశిఖములతో దాని కొట్టెను

విలవిలా తన్నుకొని హరిణమ్ము
బాధతో అరవంగ సాగెను
హా హ లక్ష్మణ హా హ సీతా
అంచు అరచుచు చచ్చిపోయెను

రాముడా పదనున్నవాడని
లక్ష్మణుని సీతమ్మ తరిమెను
పొంచి వుండిన రావణుడు సీ
తమ్మ సన్నిధి వచ్చి వాలెను

**అయోముఖి**

సరభసంగా జవురుకొని సీ
తమ్మ నరదము నందుతోసెను
తొడలపై ఆసీత నిడికొని
వడిగ వడిగా లంక జేరెను

రాముడా బంగారు జింకను
తోలువొలిచెను కండ కోసెను
వెంటనే మరొక జింక చంపెను
దాని కండల గూడ గోసెను

కండలను ఆ తోళ్లయందున
కట్టి మోసెను పర్ణశాలకు
పర్ణశాలను సీత లేదని
అదిరి పడుచును అంగలార్చెను

రామలక్ష్మణులిరువురును సీ
తమ్మకోసము వెదక సాగిరి
చెట్టులను పుట్టలను వెదకిరి
కొండలను కోనలను వెదకిరి

తాటిపండుల చూచి లక్ష్మణా
సీతస్తనములు పోలుగద అని
అరటి బోదెల చూచి లక్ష్మణ
సీత తొడలను పోలుగద అని

ఏన్గుతొండము చూచి లక్ష్మణ
సీత తొడలను పోలుగద అని
జింక కన్నులచూచి లక్ష్మణ
సీత కన్నుల బోలుగద అని

కోకిలల కూతల లక్ష్మణ
సీత గొంతును బోలుగద అని
చెట్టునీడల చూచి లక్ష్మణ
సీతతో ఏకాంత వాసము
గుర్తు వచ్చుచు దుఃఖదాయిగ
నున్నదని తపియించి పోవుచు

పద్మ సరసులచూచి లక్ష్మణ
సీతతో జలకాలు ఆడిన
గుర్తు వచ్చుచు దుఃఖదాయిగ
నున్నదని తపియించి పోవుచు

ఏమి చూచిన వాని సీతా
అంగములకును పోల్చి యేడ్చుచు
దుఃఖమునకును కామభావము
నకు విరోధం అయిన గూడా
కామదృష్టిని వదల డెప్పుడు
రాముడా సీతమ్మ యెడలను

**అయోముఖి**

సోదరద్వయమెల్ల కానన
శోధనమ్మును చేయుచుండగ
దారిలో ఒకచోట వారికి
కటస్థపడెనొక అందగత్తె

ఆమె ముఖమొక చంద్రబింబము
ఆమెనేత్రము లేణ చక్షులు
ఆమె శ్రుతులొకశ్రీద్వయమ్ము
ఆమె కంఠము శంఖరాజము

చంద్ర సఖముఖములను గలిగిన
రామచంద్రుని లక్ష్మణాఖ్యుని
చూచి రెప్పల నార్చి విస్మయ
భావమున మునిగింది ఆయమ

ఆమె శుభనామం అయోముఖి
ఆమెగూడా రాక్షసాంగన
రాక్షసులు ఒక రక్షజాతి
రక్షులంటే దేవయోనులు
అందుకే ఆ ఆయోముఖి ఒక
అందగత్తె సురూప సుందరి

వారి నిర్వైర మదిని మెచ్చుచు
అంతకంతకు చెంత జేరెను
ఎవరు మీరలు ఎందు పోవుచు
నున్నవారని పలుకరించెను

బదులు పలుకులు, నిరీక్షిస్తూ
వారి కన్నుల కన్నులుంచెను
రాము మదిలో సీత వున్నది
లక్ష్మణుని భావమ్ము శూన్యము
బదులు పలుకక కిందిమీదికి
చూచుచుండెను లక్ష్మణాఖ్యుడు

మౌనమర్ధాంగీకృతమ్మని
పట్టుకొన్నది లక్ష్మణాఖ్యుని
రార నాగృహమదిగొ ఇచటనె
గలదు వచ్చి సుఖింపుమన్నది

ఉలకకుండా పలకకుండా
ఉన్నలక్ష్మణుచేయి ఊపుచు
లాగికొని తన గృహమువైపుకు
వేసినది ఒక అడుగుముందుకు

చేయి వదిలించుకొని లక్ష్మణు
డామె ముందుకు వచ్చి నిలిచెను
క్రూరముగ ఆయమను చూచుచు
కత్తి దూసెను మీది కురికెను

**అయోముఖి**

చెవులు పట్టుకు ముక్కు పట్టుకు
పరపరాకోసేసి వేసెను
భయముతో నేడ్చిం దయోముఖి
పరుగు లంకించు కొనెను పాపం

పరుగు లెత్తుచు నున్న ఆమెను
వడిగ పట్టెను లక్ష్మణాఖ్యుడు
పట్టుకొంచును ఒక్కటొకటిగ
ఆమె స్తనములగూడ గోసెను

ఆడదానిని కసిగ తాకుట
ఘోరమగు అన్యాయముగద
పరస్త్రీ స్తనములను తాకుట
ఘోరమగు దుర్నీతిగాదా?
స్తనములను కోయుట అదెంతయొ
ఘోరమగు క్రూరమ్ముగాదా

జాతి వైరము పూని కరుణా
హీనులై ప్రేమించి వచ్చిన
స్త్రీని చిత్ర విచిత్ర హింసకు
పాలు చేయుట ఎంత దోషము

ఎంత క్రూరులో మానవాధము
లైన రాముడు లక్ష్మణాఖ్యుడు

* * *

# తార (వాలి సతీమణి)

కిష్కింధ ఒక సుందరమ్మైన నగరమ్ము
దక్షిణానొక పెద్ద పేరుగల నగరమ్ము
దానియేలిక మహాబలశాలి యగు వాలి
శస్త్రాస్త్ర ముష్టి యుద్ధములందు ధృతిశాలి
ఇంద్రుడేగాదా ఉపేంద్రాదులెవరైన
ఎదురుగా నిలిచి పోరగరాని స్థిరశాలి

వాని అనుజుండు సుగ్రీవుండు అనువాడు
వానివలె శౌర్యవంతుడును బలవంతుడును
ఆ వాలి సతితార అత్యంత రూపవతి
అతి లోక సుందరీమణి గణమ్ములయందు
నాయకమణి స్థానమును బొంది కిష్కంధ
రాజ్యరాజ్ఞిగ యేలుబడిని సాగించినది

తార సలహాలేనిదే వాలి పాలనా
వ్యవహారముల చొరవచూపువాడేగాడు
ఆ తార సాంగత్యమందు జీవితమెంతొ
హాయిగా గడుపు చుండెను వాలి సుఖముగ

ఒకనాడు మాయావి యను రాక్షసుడు వచ్చి
తొడగొట్టి సింహనాదము చేసి రణముకై
రెచ్చగొట్టగ వాలి వానితో తలపడగ
వాడు పరుగిడి ఒక్క గుహను ప్రవేశించె

వాని వెనుకను వాలి ఆ వెనుక సుగ్రీవు
డా బిలము కడకేగి బిలములోనికి దూరి
మాయావినింబట్టు కొన్నారు గట్టిగా
వాలి, ఓ సుగ్రీవ! నీవు బిలముఖ మందు
కాపుండు నేను వీనిని తునిమెద ననెను

బిలములో మాయావితోడ తలపడివాలి
ముష్టిఘాతములతో పద ఘట్టమనములతో

**తార (వాలి సతీమణి)**

గాయాలు చేయ మాయావి దేహమునుండి
రుధిర ప్రవాహమ్ము బిలము బయటికి పారె

అది చూచి సుగ్రీవుడది వాలి రక్తమని
తలచి ఆనందించి వాలియే చచ్చెనని
గుండునా బిలముఖమ్మున అడ్డముగ తోసి
కిష్కింధ యేతెంచి రాజుగా ప్రకటించి
వదిన తారను గూడ తనదిగా చేసికొని
ఇష్ట సుఖములు పొందుచుండెనా పాపమతి

అటవాలి కొన్నాళ్ళ మాయావితో పోరి
చంపి, బిలముఖముకడ నిల్చి కోపోద్రిక్తు
డై గుండు దూరమ్ముగా తన్ని అటుచూడ
సుగ్రీవుడెక్కడను కనుపించడయ్యెను
మండిపడివాలి తన నగళులకు పరువెత్తె

సుగ్రవుడచట మదిరాస వోన్మత్తుడై
మది రాక్షి మండలీ మధ్య నుండగ జూచి
కోపించి రెచ్చి సింహము జింకపై కురుకు
చందాన సుగ్రీవుపై కెగిరి పట్టుకొని
పిడిగ్రుద్దులను గ్రుద్ద, వాడు తప్పించుకొని
తానునూ వాలినే నాల్గు గ్రుద్దులు గ్రుద్దె

సమబలులు వాలి సుగ్రీవు లిద్దరు గూడ
ఈ రీతిగా ఘోరముగ పోరు సలపగా
సుగ్రీవునకు బలము తగ్గిపో సాగెను.
బలముగా వాలి సుగ్రీవుని తన్నగా
వాడు అగ్రజా కాళ్లపైన బడి ఓ యన్న
నన్ను చంపకు మన్న అని వేడుకొన్నాడు

దయతోడ ఆవాలి క్షమియించి ''బ్రదుకుపో
రా'' యంచు తరుమగా అతడు తన మంత్రి హను
మంతుతో రుశ్యమూకాద్రిపై చేరుకొని
శాపవశమున వాలి రుశ్యమూకాద్రిపై
పోరాదుగాబట్టి, అట నిర్భయమునుండె

ఇటవాలి రాజ్యమును చేపట్టి తారతో
పాటుగా తన వారితోపాటు సుగ్రీవు
భార్య అందాల బొమ్మను రుమను గూడ తా
నాక్రమించి సుఖాన రాజ్యమేలుచు నుండె

సీతమ్మలంకేశు డగు రావణ బ్రహ్మ
అపహరింపగ రాము డనుజాలక్ష్మణునితో
అన్వేషణము చేయుచును రుశ్యమూకము చేరె

అచటనే హనుమంతు సాయమున సుగ్రీవు
తో చేరి చెలిమిని చేసి సీతాన్వేష
ణమునందు తాసాయమును చేయుచో తాను
వాలిని చంపుదునని ప్రమాణము చేసె

శ్రీరామచంద్రుని పరాక్రమము రుజావుగా
చూచి సుగ్రీవు డత్యంత ధైర్యము పూని
కిష్కింధ పట్టణమేగి అంతఃపురపు
ద్వారమ్ము కడనిల్చి ఓరి, వాలీ, రార
ధైర్యముంటే నన్ను ఎదిరించి నిలువురా
లేకున్న పారిపో పో పొమ్ము వెంటనే
లేదేని నిను జంపి కసి తీర్చుకుంటాను

అనగానె విని వాలి ఆశ్చర్యముగ జూచి
కోపాగ్ని యెడద మండించగా ఉదటుగా
లేచి గదనందు కోగా తార ఆ గదను
పట్టుకొని లాగి ఇట్లనెను ఆ వాలితో

ఆర్యపుత్రా ఆగు కాస్త ఆలోచించు
నీ ముష్టి ఘాతముల తన ఒడలు హూనమై
శరణు శరణన్న సుగ్రీవుండు ఈ రీతి
ధైర్యమ్ము పూని వచ్చుటకు కారణమేమి?

ఏదియో పెద్ద సాహాయ్యమును అండగా
పొందియే యుండునని నేదలచు చున్నాను
ఔత్తరాహులు అయోధ్యా వాసులగు రామ

**తార (వాలి సతీమణి)**

లక్ష్మణులు ఇట వచ్చినారంచు విన్నాను
ఆ రామ భార్యామణీ సీత రావణుడు
అపహరించెనటంచు గూడ విని యున్నాను

ఆమె అన్వేషణలో రుశ్యమూకము వచ్చి
సుగ్రీవుతో చెలిమి కట్టిరని విన్నాను
ఆ చెలిమి బలముతో సుగ్రీవుడుగ్రుడై
నీ పైకివచ్చాడు, నీవు అది చూశావు
నేను పంపిన వేగులైదుగురు ఇప్పుడే
వచ్చి చెప్పిన విషయమునకు ఇదియే రుజావు

కాబట్టి యుద్ధమునకే వత్తుపదమంచు
సుగ్రీవు నంపి నీవారామునిం జేరి
ఓ రామ నీసీత నారావణుడె తెచ్చి
నీ కప్పగించునట్లేను జేసెద చూడు
మంచునమ్మగ బలుకు మంతెగానీ, పగను
పెంచుకో జూడకుము మనకు అదియే శుభము

అనగానె వాలి గ్రుడ్లురుముచును ఓ తార!
పిరికిమందును నూరి పోయుచుంటి విదేమి
దేవేంద్రుడేగాని ఆ ఉపేంద్రుడె గాని
సూర్యచంద్రులుగాని, యమధర్మడేగాని
ఎవరైన నన్నెదిరి జీవించలేరంచు
నీకు గూడా తెలియునది లోక విదితమ్ము

రాముడే మొదటనే నాదగ్గరికి వచ్చి
ఓ వాలి సీత నన్వేషించి సాయమును
చేయుమని కోరి యుండిన నేను చేయనా?
రావణబ్రహ్మకే కబురంపి సీతమ్మ
నేతెచ్చి శ్రీరాము కర్పింప జేయనా?

చాలు నీ సలహాలు అంచు సుగ్రీవు పై
కురికి తరిమెను యుద్ధమైదాన భూమికి
తారస్వస్త్యయనమ్ము పలికి వాలికి జయము
కోరె తామనసునిండుగ ప్రేమతో నామె

ప్రత్యక్ష యుద్ధమున వాలి నెదుర్కొనలేక
ఆచోట రాముడొక చెట్టుచాటున దాగి
గురి చూచి వాలిపై నేసె బ్రహ్మాస్త్రమ్ము
తూలిపడె వాలి భూస్థలిని రక్తము గ్రక్కి

అటుచూడ చెట్టు చాటున నుండి రాముండు
గబగబా వాలి చెంతకు వచ్చి నిలబడెను
సుగ్రీవుడును లక్ష్మణుడు ఆంజనేయాది
యోధులందరు గూడ వాలి చుట్టును చేరి
చింతింప సాగి రన్యాయంపు దెబ్బకు

వాలి రాముని చూచి ఏమిరామా నేను
నీకు చేసిన దేమి? అన్యాయముగ నన్ను
చంపకారణమేమి? తప్పుగాదా అనెను
అనగానె తాడినెక్కితివేల అంటేను
దూడగడ్డికి అన్న సామెతగ జవా బొసగె

ఈ రాజ్యమిక్ష్వాకులది రాజా భరతుండు
నీవు నీ తమ్ముని సతినాక్రమించితివి
అది తప్పు అందుకే శిక్షించితిని అనెను
చెట్టుచాటున దాగి బాణమేసితివేల
యన్న ప్రశ్నకు జంతువులను వేట ఆడుట
రాజుల పనియంచు పలికెనా రాముండు
బాహాటముగ గదా వేటాడుదురు నీవు
చెట్టుచాటున నుండి బాణమేసితివేల
నేను మృగమునుగాను మానవుండను నేను
నీ కన్న నాగరికమయిన మనిషిని నేను
ఊరకే నను జంప న్యాయమా అని అనెను

తన వాలి మరణ వార్తను విన్న ఆ తార
ఎంత ఘోరమ్మయిన వార్త ఇది అని పలికె
తనజోలికే పోని వాలి నా శ్రీరాము
డేల చంపెనటంచు కోపము వహించినది

**తార (వాలి సతీమణి)**

మహనీయుడైన నా భర్త పోయిన వెనుక
పుత్రుడెందుకు? రాజ్య మెందులకని యేడ్చె
తల బాదుకొంచు వక్షముబాదుకొంచును
భర్తపడివున్న ఆ వీరభూమికి జనెను

ప్రేమైక జీవి ఆతారచూచిన దృశ్య
మేమిటది? చాటుగాపైబడ్డ పులిచేత
చంపబడి పడివున్న పెద్ద రేచును బోలి
పడివున్న తన భర్త చూచి యేడ్చిన దామె

ఆర్యపుత్రా అంచు శవముపై బడి మూర్ఛ
పోయినది వెంటనే కలనుండి మేల్కొన్న
మూర్తివలె ఆవాలి ముఖముపైకెత్తుచును
ఆర్య పుత్రా అంచు మరల మూర్ఛిల్లినది
లేచి ప్రాయోపవేశమును ఇచ్చట జేసి
నే గూడ వాలితో స్వర్గమును చేరెదను

స్వర్గాన అందాల బొమ్మలా అప్సరల
పరికించి, అందులో నేను కనబడకయున్న
స్వర్గ సుఖముల గూడత్యజియించు నావాలి
అంచు పరిదేవనము చేసినది ఆతార

దెబ్బతిని ఘాతనిర్గత రక్తహ్రదములో
పడివున్న వాలిని చూచి సుగ్రీవుండు
బాధపడి వాలి ఔదార్యమును తలచుకొని
''నిను జంపుకోర్కి లేదుర నాకు స్వేచ్ఛగా
తిరుగుపో'' యని నన్ను వదలి పెట్టిన యన్న
వాలిని తలచుకొని యేడ్చె సుగ్రీవుండు

అదియునుంగాక తారను గూర్చి తనతోడ
''సుగ్రీవ! తార బహునేర్పరి, తెలివిగలది,
చిక్కు సమయములందు సైతమును కర్తవ్య
బోధ చేయగలట్టి ధీమంతురాలామె

ఆమె చెప్పిన యట్లు చేయుటే మంచిది''
అన్న విషయము తలచుకొని దుఃఖమందాడు

అది చూచి శ్రీరాముడును బాధపడ్డాడు
వాలితో స్నేహమును చేసి యుండిన యెడల
ఆ రావణుడె స్వయముగా సీత నప్ప జె
ప్పెడివాడు గదయంచు అతిబాధ పడ్డాడు
బాధపడుచొకసారి తారను పరికించాడు

వాలి శిరమును ఒడిలొ పెట్టుకొని కన్నీరు
కార్చుచును మింటి మొగమై వున్నతారమ్మ
నేత్రాల చూచి సుందర నేత్రములని మెచ్చి
ఆమె ధీర స్వభావమును మనసున మెచ్చె

అల్పస్వార్థం కోస మన్యాయముగ మోస
మున వాలిజంపితి నంచు చింతించుచును
ధనువుపై శిరముంచి తిలకించు చున్న ఆ
రాముని౦ జూచి మండుచు తార ఇట్లనెను

సీత నీకు లభించి నప్పటికి తర్వాత
యెడబాటు కలిగితీరును అని శపించినది

మంత్రులామెను వాలినుండి లేపేసి
దహనవాటికకు శవము మోసుకొని పోయారు
సంస్కారములు చేసి పూలదండలు వేసి
చితిపైన పండు కోబెట్టి దహియించారు

తరువాత ధనవంతమూ సుందరమునైన
కిష్కింధరాజుగా సుగ్రీవునింజేసి
రామాదులెల్ల ప్రస్రవణమ్ము చేరారు
ఇపుడు రుమ సుగ్రీవు భార్య ఐనప్పటికి
రాణిగా తారయే అయి చలామణి అయ్యె
అది వాలి కల్పించినట్టి హోదాయె మరి

## తార (వాలి సతీమణి)

సుగ్రీవుడా తారతోడ రుమతో గూడ
ఇతర యౌవనులైన సుందరీమణులతో
మద్యపానముతోడ గీత నాట్యాలతో
హాయి హాయిగ కాలమును పుచ్చుచుండెను

వర్షరుతువు దాటి శరదాగమము జరిగె
సీత నన్వేషించు పని మరచి పోయెనని
లక్ష్మణుడు సుగ్రీవు నగళులకు ఏతెంచి
ద్వారమ్ము కడ నిల్చి సుందరాంగులమధ్య
సుగ్రీవునింగాంచి నిష్ఠురోక్తులు పలికె
సుగ్రీవుడా పలుకుల కులికి పడిపోయాడు

లక్ష్మణునకెదురుగా పోనిచ్చగించక
తారతో "ఓతార! లక్ష్మణుడు వచ్చాడు
అత డొక్కముక్కోపి, నేను ముక్కోపిని
నేనతని సన్నిధికి పోనొల్లనని పలికె

రాజకీయములందు నేర్పరివగునీవు
అతని సన్నిధి కేగి సాంత్వనమ్ముగ పలికి
అతని కోపమును చల్లార్చు మంచును పలికె

మదవిహ్వలాక్షి యగు కలికి చిలకల కొలికి
హేమ సూత్ర నిబద్ధమైనట్టి కాంచితో
కించిన్నమిత దేహయష్టితో ఆతార
లక్ష్మణుని సన్నిధికి యేతెంచి నిలబడెను
ఆశ్చర్యముగ చూచు చున్న ఆతని తోడ
అనునయ ప్రాగల్భ్యముగ మాటలాడినది

వెంటనే లక్ష్మణుడు 'భర్తృ హితమును కోరు
నట్టి ఓతార! నీపతికామలోలుడై
కర్తవ్యమును మరచి యున్నాడు చూడుము
కార్యతత్వజ్ఞ! చెప్పుము ఏమి చెయ్యాలో?"

అనగానె తార యిట్లనె లక్ష్మణుని తోడ
''లక్ష్మణా మన్మథుని బలమెంతొ తెలియదా?
మునులు విశ్వామిత్రుడాదిగా గలవారు
తామరస నేత్రలకు దాసులై పోలేద!
నీవు కామాసక్తుడవు కావుకాబోలు!

తానుకామాసక్తుడై గూడ సుగ్రీవు
డా రామకార్యాన్ని మరువగనే లేదు
అందుకై ఆజ్ఞలను యేనాడొ యిచ్చాడు
లోపలికి వచ్చి సుగ్రీవు చూడగవచ్చు''

అందాల మేడలో రూపవతులకు మధ్య
కేళీవిలాసమున ఉన్న సుగ్రీవుపై
లక్ష్మణుడు కోపించి 'సుగ్రీవ! నీవు క
ర్తవ్యమును మరచి నావు కృతఘ్నుడవు

అనగానె తార ''ఓ లక్ష్మణా ధర్మాలు
తెలిసిన నీవె ఆవేశమును పొందగా
నగునె ప్రాకృతుని వలెను మాట్లాడుచున్నావు
సుగ్రీవుడు కృతఘ్నుడు కానేకాడు

రాముడొక్కడె రావణుని గెల్వగా లేడు
నా వాలి బ్రదికి యుండిన యెడల తానొకడె
రావణుని శాసించి సీతను తెప్పించి
యుండెడి వాడంచు కన్నీరు కార్చినది

లక్ష్మణుడు అటనుండి తన నివాసముకేగె
మరునాటికే కోట్లు కోట్లుగా వానరులు
వచ్చి సుగ్రీవునకు రామునికి మ్రొక్కారు
నందమున సుగ్రీవు రాము డభినందించాడు

★ ★ ★

# అప్రతర్క్యం

దశరథుండరలక్షయేడులు
ధరణి పాలన చేసినాడట
రాముడును పదివేల యేడులు
రాజ్యపాలన చేసినాడట

అంతకాలం రాజ్యమేలే
అయ్య జీవిత కాలమెంతోయ్
రమారమిగా పూర్ణ ఆయువు
లక్ష సంవత్సరములుండవె
అందులో పదునాలుగేడులు
ఎంత బాబూ, అర్ధగంటే

అర్ధగంటు అరణ్యమేగు
మటన్నమాటకు అర్థమేమిటి
రాజసౌధం ప్రక్క ఉపవన
మేగిరమ్మన్నంత సేపే

అయిన రాముడు ఏమి చేసెను
సరయు నదిని సరగ దాటెను

ఆర్య శత్రువులను వధింపన
రణ్యములలో అధివసించెను

అంతకంటే ముందె వనముల
ఆక్రమించిన ఆర్యరుషుల, ప్ర
బోధ విని స్థానికుల రక్షుల
క్రోధమున సంహరణ చేసెను

రాక్షసుల వధ కాతడొసగిన
కారణమ్మొక విచిత్రమ్మ
గోబ్రాహ్మణ హితము కొరకట
అతడు వారిని చంపి వేయుట
వర్ణ ధర్మపు రక్షణార్థం
అంట వారిని చంపి వేయుట

నాటి ధర్మమె నాటి సూక్తియె
నారిజనములు నహంతవ్యలు
గురుడు విశ్వామిత్రు పనుపున
తాటకను వధియించి వేసెను

వలచి వచ్చిన శూర్పణఖకును
ముక్కు చెవులను లక్ష్మణునిచే
కోయజేసెనదే మి న్యాయమొ
ఎంత పౌరుషహీన కార్యమొ
వలచి వచ్చిన అయోముఖికిని
ముక్కు చెవులనె గాదు స్తనముల
గూడ గొసె న,దెంత కసియొ

స్వార్థమున సుగ్రీవుకొరకై
చెట్టుమాటున దాగి వాలిని
ఎదురుగా నిలువంగ నేరక
దొంగగా వధ చేసె రాముడు

రావణుని ఒకతృణములాగా
తీసివేసిన సీతననుమా
నించి మోసముగా నరణ్యం
పాలు చేసెను పతివ్రతను

తపము చేసెడివాడు రుషిగద
తపసి శంబూకుండు శూద్రుడు
తపము చేయుట తప్పనుచు కుల
గురు వసిష్ఠుడు చెప్పగా విని
ఘోరము వధియించె నారుషి
పుంగవుని శ్రీరామచంద్రుడు

మానవుండెవడైన ఇంతటి
మానహీన విచేష్టచేయునె
కాని దేవుడుగా తలంచిన
రాముడే యీ పనుల చేసెను

శంబు కర్షిని చంపుటకు సం
జాయిషీ ఒక కుంటి సాకు
బ్రాహ్మణుని పుత్రకుడు ఒకడు అ
కాల మరణం చెందినాడట
కారణం వెదుకంగ రాముని
పాలనములో లోపమంట

వర్ణ ధర్మ విరుద్ధముగ శూ
ద్రుడు తపమ్మును చేసెనంట
తప్పు జరిగిన దని వసిష్ఠుడు
చెప్ప రాముడు చెంపెనంట

ఎంత క్రూరం ఎంత ద్రోహం
ఎంతదారుణ మారణమ్మది
తపము చేసే వాడు బ్రాహ్మణు
తో సమానం అవున కాదా?
శూద్రుడనబడడు గాదా?
తసము చేసే టట్టివాడొక
తపసి శూద్రుడు ఎట్టులగును
ఇదీ రాఘుని రాజ్యము ప్రజా
రంజకమ్మగు పాలనటయిది!

హింసచేసిన మానవునిదే
వాంశ శంభూతునిగా పొగడిన
పాడు బుద్ధుల నేమనంగా
వలయునో తెలియంగరాదు

వీరుడుగ సృష్టించె వాల్మీ
కీ రుషీశుడు రామచంద్రుని
కాని అజ్ఞులు అతని దేవుని
గా సృజించిరి పూజ చేసిరి

* * *

# అవతారాల ఆది సృష్టి

బ్రహ్మ మానసపుత్రులగు సద్
బ్రహ్మచారులు సనందాదులు
బాలరూపదిగంబరులయి
బ్రహ్మతండ్రిని చూడవచ్చిరి

వారు వైకుంఠపు ద్వారము
చేరగానే జయుడు విజయుడు
ద్వారపాలకు లడ్డుపడి త
ద్వారముననే నిలువరించిరి

వారు కోపోద్రిక్తులై ఓ
ద్వారపాలక భృత్యులారా
కండకావర మెక్కి మమ్మే
కసరుతారా అడ్డుతారా

ఇంక శాపమునిచ్చితిమి, భూ
లోకమున జన్మించు డనిరి

వారు భయపడి అయ్యలారా
మీరు బ్రహ్మజ్ఞానులు గదా!
అడుగ దగునా లోనికిని, మీ
రయ్య అమ్మను గూడి యుండగ

అందులకు మేమడ్డినామని
అలిగి శాపము ఈయదగునా
విష్ణుసాన్నిధ్యమును బాయగ
వశమె మాకని యేడ్వసాగిరి

శాపముప సంహహరణచేయగ
శాపమును తగ్గింప వేడిరి
కోప ముపసంహరణ చేయగ
తాపసులు ఒక సవరణ నిచ్చిరి

ఏడు జన్మలు విష్ణుభక్తిని
వీడకనె జీవింపగలరా
మూడుజన్మలె వైరులుగ జీ
వించి విష్ణుని చేరగలరా?

అనగనే ఆజయుడు విజయుడు
అయ్యలారా మూడు జన్మలె
చాలు విష్ణుని వీడియుండగ
వశమె మాకని మాయమయ్యిరి

వారలేకృతయుగమునందున
హిరణ్యాక్ష హిరణ్య కశిపులు
వారలే త్రేతాయుగమ్మున
రావణాసుర కుంభకర్ణులు
వారలే ద్వాపర యుగమ్మున
దంతవక్త్రుడును శిశుపాలుడు

* * *

# అవతారాలు - ప్రేరణ

అన్ని అవతారములు ఎందుకు?
ఎన్నియోమోసములు ఎందుకు?
శూద్రజాతుల కింది జాతుల
మాయలో ముంచేయుటందుకు

భగవంతుని సృష్టిచేసి
మహిమలెన్నొ అంటగట్టి
హరికతలను సృష్టిచేసి
హరిభక్తిని ప్రసారించి
లాభాలను విస్తరించి
లోభాలను నూరిపోసి
కక్షతోడ హరివైరుల
శిక్షించుట చూపి చూపి

భయంపెట్టి వెంటనే, అ
భయం యిచ్చి అజ్ఞానుల
బుద్ధి శుద్ధి చేసి హరికి
భక్తుల చేసేసినారు

వర్ణ ధర్మఫలముగ, సా
వర్ణావకాశమ్ము నొంది
స్త్రీలకు శూద్రులకును వి
ద్యాలాభం నిషేధించి

తర్కబుద్ధి చంపివేసి
దద్దమ్మలచేసినారు
కతలకెల్ల తలలూచే
గంగిరెద్దులచేసినారు
పాడి పంటలందించే
పశువుల చేసేసినారు
సకలైశ్వర్యాల నిచ్చు
సంతగవుల (గోవుల) చేసినారు

భగవంతుని సృష్టిచేసి
భగవంతుడు కేవలమొక
బ్రాహ్మణులకే సొంతం, అను
ప్రథలను కల్పించినారు

జీవహింస పూర్ణములొ
యజ్ఞాలను నిర్వహించు
బ్రాహ్మణ పక్షాన నుండు
పక్షపాతి భగవంతుడు

మాసంభక్షకులు బ్రాహ్మణ
హింసకులొసగే వపతో
సోమరసం కొరకై ర
క్షోమారణ మాచరించు

యజ్ఞమనగ హింసయంచు
యజ్ఞము నాపగ బూనిన

వారిని రాక్షసులు చేసి
వధియింపగ బూనినారు

మాయలవాడగు విష్ణువు
మాయా అవతారాల నెత్తి
మట్టుబెట్టి బ్రాహ్మణ సం
తుష్టి కలుగ జేసినా రు

వరాహావతారమెత్తి
హిరణ్యాక్షు వధియించెను
నృసింహావతారమెత్తి
హిరణ్యకశిపు వధియించెను

వామన అవతారమెత్తి
బలిని అణిచి వేసేసెను
రాముని అవతారమెత్తి
రావణ వధ చేసేసెను

కృష్ణుని అవతారమెత్తి
శిశుపాలుని చంపేసెను
ఇదియే అవతారగాధ
తర్కదూరమైన గాధ
మూఢాత్ముల జేసి ప్రజను
భయభక్తుల నింపుగాథ

* * *

# ఆర్యావర్తం - ఋగ్వేదం

ఆర్యులు పైనుండి ఇండి
యా వచ్చిరటన్నమాట
కొందరు ప్రాగ్వాదులు కా
దందురు వాగ్వాదమ్మది

ఆవర్తమ్మనగఅర్థ
మాక్రమణమ్మని గాదా?

ఆర్యుల తొలి ఆక్రమణము
ఉత్తర భారతముగదా
అందుల కుత్తరభారత
మార్యావర్తమ్మయ్యెను

ఆర్యవర్తః పుణ్యభూమి
ర్మధ్యం వింధ్య హిమాగయోః
అని అమరం చెబుతున్నది
కావున ఉత్తర భారత
మార్యుల ఆక్రమణమ్మే

ఆర్యులిండియా చొచ్చిన
అనంతరమె ఋగ్వేదం
రచియించిరి ప్రాగార్యులు
అది గేయంలో సాగెను

దానిని రుక్కులు అందురు
దానిని మంత్రాలందురు
అదికేవల స్తుతి రూపం
అది ప్రార్థనముల రూపం

ముఖ్యంగా పంచభూత
ముల కోసం ప్రార్థనలె

ఇంద్రుడు మేఘాధిపతి
వర్షం కొరకతని ప్రార్థన
శత్రుజయమునిచ్చుటకో
సం గూడా ఆ ప్రార్థన

పాంచ భౌతకము శరీర
మందున ముఖ్యము ప్రాణం
ప్రాణాధారమ్మ వాయు
వందుకు వాయు ప్రార్థన

ప్రాణుల దేహముల కుష్ణ
మిచ్చి ప్రకాశమును ఇచ్చి
దేహినిగా చేయు శక్తి
అందుకగ్నికై ప్రార్థన

ప్రతి ప్రాణికి హృదయముండు
హృదయమందు మనసుండును
మనసుకు చంద్రుడు అధిపతి
అందుకు చంద్రుని ప్రార్థన

వాయువు తర్వాత జలం
ప్రాణాధారం ప్రాణికి
జలముల కధిపతి వరుణుడు
అందుకు వరుణుని ప్రార్ధన

ప్రాణుల దేహముల యందు
ఉష్ణశక్తి జీవశక్తి
ఉష్ణముతో పాటు శక్తి
ఇచ్చు సూర్యునికి ప్రార్ధన

ఆహారం ఓషధులకు
అవసమైనది పృథివి
సర్వానికి ఆకరమయి
నందులకై భూప్రార్ధన

ఈలాగె నదుల గూర్చి
వనముల జంతువుల గూర్చి
క్రిమి కీటకములను గూర్చి
గ్రహముల నక్షత్రమ్ముల

ఉషస్సంధ్యలను గూర్చి
ఇతరేతర ప్రకృతి గూర్చి
ఎన్నెన్నో వర్ణనములు
అంతేనా తరతరాల
కతలు వేదమందు గలవు

డా॥ అంతటి ..... రచనలు

## కవితలు

కంకాళ రాత్రి
పద్యమంజరి
నవ సృష్టి
ఇప్పుడే ( ప్రతీకారం)
కాలవేదం
(అ) వన మహోత్సవం
ముక్కంటి సందేశం
తుంగాపానం
కలిపురాణం
అవతారాల మోసాలు
రామాయణంలో స్త్రీలు
కథన కవితావల్లరి

## బాలల నవలలు

కోట వీరన్న సాహసం
ఉదయగిరి పోలన్న
మంత్రాల రామన్న
కవిగారి బాల్యం
కవిగారి హైస్కూలు చదువు

## నవలలు

ఆదర్శం
ప్రేమ భిక్ష
భావం
( లేడీ లెక్చరర్) స్వగతం
శంపాలత
చీకట్లో కాంతి రేఖలు
ఆప్ బీదీ ( హిందీ)
మండే చంద్రుడు
శైలజ
హంసల దీవి

## చారిత్రక నవలలు

శ్రీకృష్ణ దేవరాయలు
రామరాయలు
మహాత్మ పంచకం
బుద్ధ పరమాత్మ
మహాత్మా గాంధీ
మహాత్మా జోతిరావు పులే
శ్రీ నారాయణ గురు
మహాత్మా అంబేడ్కర్

## నాటకాలు

సమరసత్వం
సహజీవనం
మానవత్వం
పరిష్కారం
ఎక్కడి గొంగడి అక్కడనే
మహిళా మహస్సు
వేలం వెర్రి
భువన విజయం
నిత్య కల్యాణి
ముల్లును ముల్లుతోనే

## నృత్యనాటికలు

ముక్కంటి ముక్కోణం

## విమర్శ

ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు( Thesis)

మొదలయిన అనేక సంఘ సంస్కరణ కార్యకలాపాల్లో ఆచరణాత్మక అవిరళ కృషి. తత్సంబదిక సాహిత్య సృష్టి. అనేక పద్య గేయ, వచన కవితా కావ్యాలు, నృత్యనాటికలూ, మొదలయినవి నలభై దాకా అచ్చుఅయినవి. అచ్చు కావలసినవి ఇంకా వున్నాయి.

1950 నుండి అనేక హైస్కూళ్లలోనూ, కాలేజీల్లోనూ అనేక సన్మానాలు, 1987లో ఘనంగా షష్టిపూర్తి సన్మానం.

అవార్డులు 1. మేజర్ బలరామిరెడ్డి స్మారక మెడల్ (For the best thesis (1974) Sri Venkateswara University)
2. పాయిట్రీ అవార్డు – తెలుగు యూనివర్శిటీ, 1993
3. ధర్మనిధి పురస్కారం తెలుగు యూనివర్శిటీ 1998
4. శ్రీ నారాయణగురు అవార్డు. (కేరళ) 1999

డాక్టర్ అంతటి పైన రిసెర్చి) : 1. డా. పి. చెన్నకేశవులు, యం.పిల్. 1994
2. పి. చూడామణి యం.ఫిల్, 1998 ఆమె పిహెచ్‌డి కూడా చేస్తున్నది. (యస్.వి.యూనివర్శిటీ)



జననం 1925. కడప జిల్లా వెంకట్రాజుపల్లిలో. తెలుగు, యం.ఏ. హిందీ విశారద. ''ప్రబంధములలో ప్రకృతి వర్ణము పైన యస్.వి. యూనివర్శిటీలు డాక్టరేడ్ సంపాదన. 1974లో సర్వోత్తమ మైనదిగా బహుమతి. అనేక ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో అధ్యాపక వృత్తి. ప్రిన్సిపాలు 1976 నుండి సెక్రటేరియట్‌లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతచిక వ్యవహారాల ప్రత్యేకాధికారి. 1962 నుండి వెనుకబడిన తరకతుల సహకార ఆర్థిక సహాయ సంస్థ అభివృద్ధి అధికారి. ఎ.ఫ. వాషర్‌మెన్ ఫెడరేషన్ మొదటి చైర్మన్.

హైస్కూలులో రోజుల నుండి, అస్పృశ్యతా నివారణ కుల నిర్మూలన స్త్రీ విద్య

వెనుకబడిన తరకతుల సహకార ఆర్థిక సహాయ సంస్థ అభివృద్ధి అధికారి. ఎ.ఫ. వాషర్‌మెన్ ఫెడరేషన్ మొదటి చైర్మన్.

హైస్కూల్లో రోజుల నుండి, అస్పృశ్యతా నివారణ కుల నిర్మూలన స్త్రీ విద్య మొదలయిన అనేక సంఘ సంస్కరణ కార్యకలాపాల్లో ఆచరణాత్మక అవిరళ కృషి. తత్సంబదిక సాహిత్య సృష్టి. అనేక పద్య గేయ, వచన కవితా కావ్యాలు, నృత్యనాటికలూ, మొదలయినవి నలభై దాకా అచ్చుఅయినవి. అచ్చు కావలసినవి ఇంకా వున్నాయి.

1950 నుండి అనేక హైస్కూళ్లలోనూ, కాలేజీల్లోనూ అనేక సన్మానాలు, 1987లో ఘనంగా షష్టిపూర్తి సన్మానం.

అవార్డులు 1. మేజర్ బలరామిరెడ్డి స్మారక మెడల్ (For the best thesis (1974) Sri Venkateswara University)

2. పొయిట్రీ అవార్డు – తెలుగు యూనివర్శిటీ, 1993
3. ధర్మనిధి పురస్కారం తెలుగు యూనివర్శిటీ 1998
4. శ్రీ నారాయణగురు అవార్డు. (కేరళ) 1999

డాక్టర్ అంతటి పైన రిసెర్చి : 1. డా. పి. చెన్నకేశవులు, యం.పిల్. 1994
2. పి. చూడామణి యం. ఫిల్, 1998 ఆమె పిహెచ్‌డి కూడా చేస్తున్నది. (యస్. వి. యూనివర్శిటీ)



జననం 1925. కడప జిల్లా వెంకట్రాజుపల్లిలో. తెలుగు, యం.ఏ. హిందీ విశారద. ''ప్రబంధములలో ప్రకృతి వర్ణము పైన యస్.వి. యూనివర్శిటీలు డాక్టరేట్ సంపాదన. 1974లో సర్వోత్తమ మైనదిగా బహుమతి. అనేక ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో అధ్యాపక వృత్తి. ప్రిన్సిపాలు 1976 నుండి సెక్రెటేరియట్‌లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతచిక వ్యవహారాల ప్రత్యేకాధికారి. 1962 నుండి వెనుకబడిన తరకతుల సహకార ఆర్థిక సహాయ సంస్థ అభివృద్ధి అధికారి. ఎ.ఫ. వాషర్‌మెన్ ఫెడరేషన్ మొదటి చైర్మన్.

హైస్కూల్లో రోజుల నుండి, అస్పృశ్యతా నివారణ కుల నిర్మూలన స్త్రీ విద్య మొదలయిన అనేక సంఘ సంస్కరణ కార్యకలాపాల్లో ఆచరణాత్మక అవిరళ కృషి. తత్సంబదిక సాహిత్య సృష్టి. అనేక పద్య గేయ, వచన కవితా కావ్యాలు, నృత్యనాటికలూ, మొదలయినవి నలభై దాకా అచ్చుఅయినవి. అచ్చు కావలసినవి ఇంకా వున్నాయి.

1950 నుండి అనేక హైస్కూళ్లలోనూ, కాలేజీల్లోనూ అనేక సన్మానాలు, 1987లో ఘనంగా షష్టిపూర్తి సన్మానం.

అవార్డులు 1. మేజర్ బలరామిరెడ్డి స్మారక మెడల్ (For the best thesis (1974) Sri Venkateswara University)

2. పొయిట్రీ అవార్డు – తెలుగు యూనివర్శిటీ, 1993